# మిసిమి

679

***"All that we are is the product of what we have thought,' is "We are what we think." –*** **Dammapada.**

సంపుటి 4 సెప్టెంబర్ 1992 సంచిక 2

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి 4/- వార్షిక చందా రూ.50/-

ముఖచిత్రం
మొక్కపాటి కృష్ణమూర్తి

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Court Fool,** *n.* The plaintiff.

**Coward,** *n.* One who in a perilous emergency thinks with his legs.

**Craft,** *n.* A fool's substitute for brains.

**Crayfish,** *n,* A small crustacan very much resembling the lobster, but less indigestible.

**Creditor,** *n,* One of a tribe of savage dwelling beyond the Financial Straits and dreaded for their desolating incursions.

**Critic,** *n,* A person who boasts himself hard to please because nobody tries to please him.

**Cross,** *n.* An ancient religious symbol erroneously supposed to owe its significance to the most solemn event in the history of Christianity, but really antedating it by thousands of years. By many it has been believed to be identical with the *crux ansata* of the ancient phallic worship, but it has been traced even beyond all that we know of that, to the rites of primitive peoples. We have to-day the White Cross as a symbol of chastity, and the Red Cross as a badge of benevolent neutrality in war. Having in mind the former, the reverend Father Gassalasca Jape smites the lyre to the effect following:

**Cunning,** *n.* The faculty that distinguishes a weak animal or person from a strong one. It brings its possessor much mental satisfaction and great material adversity. An Italian proverb says: "The furrier gets the skins of more foxes than asses."

**Cupid,** *n.* The so-called god of love. This bastard creation of a barbarous fancy was no doubt inflicted upon mythology for the sins of its deities. Of all unbeautiful and inappropriate conceptions this is the most reasonless and offensive. The notion of symbolizing sexual love by a semisexless babe, and comparing the pains of passion to the wounds of an arrow-of introducing this pudgy homunculus into art grossly to materialize the subtle spirit and suggestion of the work-this is eminently worthy of the age that, giving its birth, laid it on the doorstep of posterity.

**Curiosity,** *n,* An objectionable quality of the female mind. The desire to know whether or not a woman is cursed with curiosity is one of the most active and insatiable passions of the masculine soul.

**Curse,** *v.t.* Energetically to belabor with a verbal slap-stick. This is an operation which in literature, particularly in the drama, is commonly fatal to the victim. Nevertheless, the liability to a cursing is a risk that cuts but a small figure in fixing the rates of life insurance.

**Cynic,** *n.* A blackguard whose faulty vision sees things as they are, not as they ought to be. Hence the custom among the Scythians of plucking out a cynic's eyes to improve his vision.

**Damn,** *v.* A word formerly much used by the Paphlagonians, the meaning of which is lost. By the learned Dr. Dolabelly Gak it is believed to have been a term of satisfaction, implying the highest possible degree of mental tranquillity. Professor Groke, on the contrary, thinks it expressed an emotion of tumultuous delight, because it so frequently occurs in combination with the word *job or god,* meaning "joy." It would be with great diffidence that I should advance an opinion conflicting with that of either of these formidable authorities.

# టావో

# ఆధునిక భౌతికశాస్త్రం

- కాకాని చక్రపాణి
- డా. డి.చంద్రశేఖరరెడ్డి

క్రీ.పూ.6వ శతాబ్దపు చైనాదేశతత్త్వవేత్త లావో జు (Lao tzu) రాసిన చిన్న తాత్త్వికగ్రంథం టావో టే ఛింగ్ (Tao Te Ching). సుమారు ఐదువేల మాటలున్న ఈ చిన్నిగ్రంథం సంప్రదాయ చైనీయ తాత్త్వికతకు మూలం.

'టావో' అంటే 'మార్గ'మని చాలమంది అభిప్రాయం. నిజానికి దాని అర్థం, 'విశ్వపరిణామ మార్గం' 'టే' అంటే సరైన ప్రదేశంలో, సరైన మానసికస్థితిలో, సరైన సమయంలో ప్రభవించే మహాశక్తి. ప్రాచీన చైనీయులు విత్తులునాటటాన్ని 'టే' అని పిల్చేవాళ్ళు. అంటే నిలువవుంచిన శక్తిఅని దానిఅర్థం. 'ఛింగ్' అంటే సర్వోత్కృష్టమైనది అని అర్థం. మామూలు మాటల్లో 'టావో టే ఛింగ్' అంటే విశ్వపరిణామశక్తి 'టావో' అనీ, 'టావో' మార్గానుసరణంవల్ల వచ్చే వైయక్తికశక్తిని వర్ణించే ఉత్కృష్ట గ్రంథమే ఇదీ అని చెప్పవచ్చు.

లావో జు 'చౌ' వంశరాజుల ప్రభుత్వ పత్రనిలయ సంరక్షకుడుగా పని చేసేవారు. మహా రాజకీయ అస్తవ్యస్త పరిస్థితి నెలకొన్నరోజులవి. చైనాలో వందలరాష్ట్రాలుండేవి. ప్రతిరాష్ట్రానికీ ప్రత్యేక చట్టాలు వుండేవి, నాయకులువుండేవారు. ఆయుధ, సైన్య సమీకరణలతో ప్రతిరాష్ట్రం మరోరాష్ట్రంతో తలపడటానికి సిద్ధంగావుండేది. ప్రతిరాష్ట్రం రాజకీయ ప్రాబల్యానికై పాటు పడేది. చైనా పూర్తిగా వినాశనమయే పరిస్థితి అది. అలాంటి పరిస్థితుల్లో లావోజు సన్యసించాడు. నగరాన్ని త్యజించటానికి ముందు ఆయన రచించిన గ్రంథమే 'టావో టే ఛింగ్'. ఇతరులకు మార్గ దర్శకత్వం వహించగలిగే స్థానంలో వున్న వ్యక్తులనుద్దేశించి రాసిన గ్రంథమది.

ఈ గ్రంథంలో 81 అధ్యాయాలున్నాయి. అంటే 9 x 9 = 81. సంఖ్యల అవయవానురూపత్వాన్ని సంభావించిన చైనాదేశీయ తత్వవేత్తలకు 9 మహత్తరమైన సంఖ్య. 'చతుర్ణ్రేఖాళి' (tetragrams)అనే గణిత చిత్రాలద్వారా ప్రాచీన చైనీయులు 9వ సంఖ్య మహత్వాన్ని వెలికెత్తి చూపారు. పాశ్చాత్యగ్రంథాల్లోని అధ్యాయాలకీ, ప్రాచీన చైనాదేశ గ్రంథాల అధ్యాయాలకీ భేదంవుంది. పాశ్యాత్యగ్రంథాల అధ్యాయాలు విశ్లేషణాత్మకంగా ఒక అధ్యాయంతరువాత మరో అధ్యాయంలో విషయ వికసనం జరిగితే, ప్రాచీన చైనా గ్రంథాల అధ్యాయాలు దేనికంతటవే సంపూర్ణమైనవి. కొద్ది మార్పుతప్ప మరో భేదం వుండదు. అందువల్లపుస్తకంలో ఏ అధ్యాయమైనా తీసి చదువుకోవచ్చు.

**మిసిమి, సెప్టెంబరు 1992**

'టావో టే ఛింగ్'లో ఆనాటి చైనా నాయకులనుద్దేశించి లావోజు చెప్పిన మాటల సారాంశమిది: నువ్వెవరో తెల్సుకో; నీ చుట్టూవున్న ప్రపంచానికి ప్రత్యక్షంగా ప్రతిస్పందించటం నేర్చుకో. మనసులో కలిగిన భావాల గూర్చి ఆలోచించు; ఎలాంటి సిద్ధాంతాలు, ఆదర్శాలపైనా ఆధారపడవద్దు. అందువల్ల నీ జీవితం నిరర్థకమవుతుంది. నీవప్పుడు నాయకత్వం వహించటానికి పనికిరావు. ఆత్మప్రేరణను పొందు; ఎందువల్లనంటే ఆత్మప్రేరణలేని నాయకుడు మార్పుని గూర్చి ప్రవచించలేడు. విశ్వంలోనూ, ఇతరుల మనసుల్లోనూ పనిచేసే భౌతిక నియతుల జ్ఞానస్పృహతో నీ వైయక్తిక శక్తిని పెంపొందించుకో. సంఘటనల దిశానిర్దేశానికై ఆశక్తినుపయోగించు; కాని, బల ప్రదర్శన చేయవద్దు. క్రియను ఆచరించటం కాక, వైఖరినవలంబించు. ఇతరులకు దారిచూపుతూ నాయకత్వం వహించు కాని, వాళ్ళను నీ ఆజ్ఞలు పాలించేవాళ్ళుగా భావించి నాయకత్వం నెరపవద్దు. నిరాడంబరతను పాటించు. నిన్ను నువ్వు పెంపొందించుకో.

వ్యతిరేకతను, ప్రతిచర్యను సృజించని పద్ధతులనుపయోగించటమే సంఘటన దిశానిర్దేశాని కనువైన మార్గమని భావించారు లావోజు. **ప్రకృతి నియతుల అవలోకనంతో, అధికశక్తి ప్రయోగం వ్యతిరేకశక్తి ఉత్పాదకమని గ్రహించాడు ఆయన. అందువల్ల పదికాలాలపాటు మనగలిగే సమాజనిర్మాణానికి బలప్రయోగం ఉపకరించదని ఆయన భావించారు.**

విశ్వంలోని పదార్థం, శక్తుల లాగా మానవుడి ఆవేశోద్వేగాలు, బుద్ధి, బాహ్యశక్తుల ప్రేరణవల్ల నిరంతరం మారుతుంటాయనీ, అందువల్ల మన నమ్మకాలను శాశ్వతం చేయాలనే ఉద్దేశంతో వాటికై కొట్లాడి, సమర్థించి, ఇతరులకు నచ్చచెప్పటంలో కాలం వ్యర్థం చేయరాదనీ లావోజు భావించారు. మన పొరపాటును గ్రహించి, ప్రకృతి పరిణామాని కనుగుణంగా మనల్ని మనం మల్చుకున్నట్లయితే మనలో శక్తి ప్రభవిస్తుందని ఆయన భావించారు. ప్రకృతి శక్తులతో సహకరించటంవల్ల మనం ఆశక్తులలో భాగస్వాముల మవుతాం. అప్పుడు మన నిర్ణయాలు ఊహల ఆలోచనలనుండి వచ్చినవికాక, క్రియా, పరిణామశీల సత్యంనుండి ప్రభవించినవవుతాయి. అప్పుడు ఇతరుల కలవడని దృష్టి మనకలవడుతుంది. ఈ దృష్టి వికసనంతో, అది కల్గించిన శక్తితో మనం భవిష్యత్తును సృజించగలం. ఇదే వైయక్తికశక్తి. ఇది అనుభూతం కాని వ్యక్తులు భయానికి లోనవుతారు. ప్రపంచంలో తమని తాము గుర్తించుకోక పోవటంవల్ల వారికి భయంకల్గుతుంది. అలా మానసిక సమగ్రత దెబ్బతిని, వారు సమాజానికి ప్రమాదకారులుగా తయారవుతారు. నియంతలకు ఈ శక్తి అనుభూతంకాదు. విఫలత్వం, అసామర్థ్యం వాళ్ళని వెన్నాడుతుంది. హక్కుండి వాళ్ళు శక్తిని ప్రయోగించరు; దౌర్జన్యంతో ప్రయోగిస్తారు. ఇతరులపై అధికారం చెలాయించే వాళ్ళందరూ నిజానికి తమ భద్రతారాహిత్యానికి బానిసలు; మెల్లమెల్లగా వాళ్ళ కర్మలే వాళ్ళకు చెరుపుచేస్తాయి. ప్రపంచంలో మనుషులు బాధ పడటానికి కారణం, వాళ్ళు తమను శక్తివంతులుగా, స్వతంత్రులుగా భావించకపోవటమే. శక్తివంతులు తమ ఆచరణ, వైఖరులతో ఇతరులను ప్రభావితం చేస్తారు. వైయక్తిక శక్తి పెంపొందిన వ్యక్తుల్లో వచ్చే మార్పులు రెండు - ఒకటి బౌద్ధిక స్వాతంత్ర్య వికసనం, రెండు నిరాడంబరత. విశ్వాన్ని అర్థంచేసుకోవటమే టావోమతం; ఇది విశ్వాసంమీద ఆధారపడ్డది కాదు, అనుభవం మీద ఆధారపడ్డది. మానవుడి మనస్సు పరిణామం పొందే

దయితే, సామాజిక వ్యవస్థలన్నీ తాత్కాలిక ప్రయోగాలు మాత్రమే. విశ్వాన్ని గూర్చి ప్రత్యక్ష నైయక్తిక జ్ఞానం పొందక, ఓ సిద్ధాంతాన్ని నమ్మటంవల్ల ఆ శక్తి ప్రాదుర్భవించదు. మనిషిని నిరాడంబరత వాస్తవిక సత్యపు దరికి చేరుస్తుంది. నిరాడంబరుడు ఎలాంటి వ్యామోహంలోనూ పడడు. ఎందుకంటే అతనికి కావల్సిందంతా అతనిదగ్గరే వుంది కనుక.

బహుశ: లావోజు మొదటి భౌతికశాస్త్రవేత్త. ప్రకృతిని పరిశీలించటం, ప్రకృతిలోని భౌతిక నియతులను గమనించటంలో ఆయన తన బౌద్ధిక శక్తినంతా వినియోగించాడు. శక్తుల కేంద్రీకృతక్షేత్రాన్ని ఆయన గమనించాడు, దాన్నే ఆయన 'టావో' అన్నారు; దాన్ని తార్కికంగా, విశ్లేషణాత్మకంగా వివరించ వీలుకాదు కనుక ఆయన విరోధాభాసంగా దాన్ని వివరించాడు. ఉనికికి ముందు భావం వుంది; అది పరిపూర్ణమైంది; ఇది తన్ను తాను తెల్సుకోవాలనే కోరికతో నాస్తి నుండి అస్తికి ప్రభవించింది; ఫలితంగా అనంతమైన కార్యకారిణత్వం దృశించింది - ఇది బిగ్ బాంగ్ థియరీ (Big Bang Theory)ని పోలివుంటుంది. వెంటనే స్పేస్ ఏర్పడ్డది; దాంతో కాలమూ మొదలయింది; రెండు ఆవేశస్థితులు 'యింగ్' (నెగెటివ్), 'యాంగ్' (పాజిటివ్) ఏర్పడ్డాయి. యింగ్, యాంగ్‌ల విరుద్ధధృవాల కలయిక ఫలితంగా పదార్థం, శక్తి అవిర్భవించాయి; మొదట్లో అవి అభిన్నంగా వున్నా, తర్వాత వేరయి, మనకు భౌతికవాస్తవికత అయిన విశ్వం అవతరించింది. మనుషులను, వారిచర్యలు, ధోరణులను వారుండే పరిసరాలనుండి వేరుచేయటం సాధ్యంకాదని లావోజు భావించారు; ఇందులో ఏ ఒకటయినా రెండవదాని వాస్తవ సత్యాన్ని మార్చగలదనీ ఆయన అభిప్రాయపడ్డారు. క్వాంటం సిద్ధాంతం వెలువడటంతో, మానవుడి చేతనకు విశ్వం నడిచేతీరుకు సంబంధం వుండటం చూసిన ఆధునిక భౌతికశాస్త్రవేత్తలు ఎంతో ఆశ్చర్యపోయారు. ఈ విషయాన్ని లావోజు ఎప్పుడో ఇరవైఆరు శతాబ్దాల క్రిందటే కనుగొన్నారు.

టావో సిద్ధాంతాలపై ఆధారపడి
చాలామంది చాల రకాలుగా వ్యాఖ్యానాలు వ్రాసారు.
అందులో యిదొకటి.

## ఆధునిక భౌతికశాస్త్రం

సత్యపు ప్రత్యక్ష మార్మికానుభవాన్ని ఓ మనిషి ప్రాపంచిక దృష్టి పునాదులను కదిలించివేసే గొప్ప సంఘటనగా ప్రాచ్య మార్మికవాదులు అభివర్ణించారు. ఈ శతాబ్దపు ప్రారంభం నుండి భౌతిక శాస్త్రవేత్తల అనుభవం కూడా అదే. అణు సత్యాన్ని గూర్చిన నూతనానుభవంతో వాళ్ళ ప్రాపంచిక దృష్టి పునాదులూ కదిలిపోయాయి. అణుభౌతిక నూత్న సత్యాల పరిచయంతో ఐన్‌స్టీన్‌కి అలాంటి షాకే కలిగింది.

ఆధునిక భౌతికశాస్త్రపు కొత్త ఆవిష్కరణలు స్పేస్, టైం, ద్రవ్యం, కార్యకారిణత్వం లాంటి మౌలిక భావాల్లో మార్పులు తీసుకువచ్చాయి. ప్రపంచ దృష్టికి ఇవి ఎంతగా ఆధారశిలలయ్యాయంటే, శాస్త్రజ్ఞులు వీటిని మార్చుకోకతప్పని పరిస్థితి ఏర్పడేసరికల్లా షాక్‌లాంటి అనుభూతిపొందారు. ఈ మార్పుల నుండి నూత్నమూ, మౌలికమూ అయిన భిన్న ప్రాపంచిక దృష్టి ప్రభవించింది; ఇంకా ఈ మార్పులు కొనసాగుతూనే వున్నాయి.

## సంప్రదాయ భౌతికశాస్త్రం :

సంప్రదాయ భౌతిక శాస్త్రం విశ్వాన్ని గూర్చిన న్యూటన్ యాంత్రిక నమూనాపై ఆధారపడివుంది. ఈ నమూనా సంప్రదాయ భౌతికశాస్త్రానికి స్థిరమైన చట్రాన్ని ఏర్పరిచింది. ఆ చట్రంలో సంప్రదాయ యూక్లిడ్ జ్యామెట్రీ ఇమిడిపోయింది, పరిపూర్ణమూ, నిరంతర విశ్రామశీలమూ, మార్పులేనిదీ అయిన మూడు డైమెన్షన్ల స్పేస్‌కు దీంట్లో ప్రాధాన్యము లభించింది. టైం అంటే కాలానికి ఈ భౌతిక ప్రపంచంతో సంబంధం లేదు.

ఈ పూర్ణ స్థల కాలాల్లో సంచరించే న్యూటన్ మూలకాలు పదార్థ రేణువులు. న్యూటన్‌కి అవి సూక్ష్మంగా, ఘన పరిమాణంలో, అవిచ్ఛిన్నాలుగా కన్పించాయి. వాటినుండే మొత్తం ద్రవ్యమంతా ఏర్పడింది. గ్రీకు అణు సిద్ధాంతకర్తల అభిప్రాయమూ ఇదే. అయితే భేదమల్లా న్యూటన్ సిద్ధాంతంలో రేణువుల మధ్య సంచరించే శక్తిని గూర్చిన ఖచ్చితమైన వర్ణన. ఈ శక్తి– రాశులపైనా, రేణువుల పారస్పరిక దూరంపైనా – ఆధారపడివుంది. దీన్నే గురుత్వాకర్షణ శక్తి అన్నారు. వస్తువులపై ఈ శక్తి ప్రభావం వున్నదనీ, కొంతదూరం వరకు ఇది విస్తరించి వుండనీ న్యూటన్ గుర్తించాడు. ఇది వింతైన సిద్ధాంతమైనా, తదుపరి దీన్ని గూర్చిన పరిశోధనలు జరుగలేదు. న్యూటన్‌కు ఈ రేణువులను, వాటి మధ్య వున్న శక్తినీ సృజించింది దేవుడేనన్న భావన కలిగింది; అందువల్ల దానిపై తదుపరి విశ్లేషణ జరగలేదు.

న్యూటన్ యాంత్రిక వాదంలో, స్పేస్‌లో వస్తువులు చలిస్తున్నాయనీ, వాటి పారస్పరిక ఆకర్షణ – గురుత్వాకర్షణ శక్తి – దానికి కారణమనీ భౌతిక సంఘటనలన్నిటిని అభివర్ణించటం జరిగింది. రాశిపై వున్న ఈ ఆకర్షణ శక్తిని ఖచ్చితంగా గణితంలో వర్ణించటానికై న్యూటన్ కొత్త భావాలను, డిఫరెన్షియల్ కాల్‌క్యులస్‌లోని గణిత సమీకరణలనూ కనుక్కున్నాడు. నిజానికిది గొప్ప మేధోవిజయం.

సంప్రదాయ భౌతికవాదానికి మూలాధారం న్యూటన్ సమీకరణాలు. అవి స్థిరమైన సూత్రాలు. వస్తుచలనాన్ని నిబద్ధం చేసిన సూత్రాలవి. భౌతిక ప్రపంచంలో జరిగే మార్పులన్నీ వాటి ప్రకారమే సంభవిస్తున్నాయి. మొదట్లో దేవుడు ద్రవ్యరేణువుల్నీ, వాటి మధ్య శక్తినీ, మూల భౌతిక చలన సూత్రాల్నీ సృజించాడు; మొత్తం విశ్వాన్ని చాలితం చేశాడు; అప్పటినుండి మార్పుకు లోనుగాని సూత్రాలకు నిబద్ధమై చలించే యంత్రంలాగ విశ్వం చరిస్తూనే వుంది.

ప్రకృతిని గూర్చిన ఈ యాంత్రిక దృష్టికీ నియతవాదా (Determinism) నికీ దగ్గర సంబంధముంది. ఈ మహాకాశ విశ్వయంత్రం సహేతుకమనీ, నియతమనీ సంభావించటం జరిగింది. జరిగే దానికల్లా ఓ ఖచ్చితమైన కారణం వుంటుంది; ఖచ్చితమైన ఫలితం సంభవిస్తుంది. ఏ కాలంలో అయినా ఇది ఇలా జరుగుతుందని ఊహించి చెప్పవచ్చు. డికార్టె ప్రవచించిన 'అహం – విశ్వం' మధ్య వున్న మూల భౌతిక విభాగమే ఈ నియతవాదానికున్న తాత్త్వికాధారం. ఈ విభాగం కారణంగా ప్రపంచాన్ని వస్త్వాశ్రయ రూపంగా, అంటే ఏ మాత్రం మానవ పర్యవేక్షకుడి ప్రమేయం లేకుండా, వర్ణించవచ్చుననే భావం ఏర్పడింది; అలాంటి ప్రాకృతిక వస్త్వాశ్రయ వర్ణనే శాస్త్రానికంతా ఆదర్శమైంది.

మిసిమి, సెప్టెంబరు 1992

18, 19 శతాబ్దాల్లో న్యూటన్ యాంత్రిక సిద్ధాంతం ఘన విజయాన్ని పొందింది. న్యూటన్ తన సూత్రాల్ని గ్రహ చలనానికి అన్వయించి సౌర వ్యవస్థకున్న మూల లక్షణాన్ని విప్పి చెప్పగలిగాడు; నిజానికి ఆయన విపులీకరణ లోపభూయిష్టం. ఉదాహరణకు గ్రహాల మధ్య వున్న ఆకర్షణ శక్తిని అది పరిగణనలోకి తీసుకోలేదు. అందువల్లనే ఆయనకు కొన్ని అక్రమ చలనాలు కన్పించాయి; వాటిని గూర్చి ఆయన వ్యాఖ్యానించలేక పోయాడు; వీటిని సరిచేయటానికి భగవంతుడున్నాడని ఆయన సరిపెట్టుకున్నాడు.

లాప్లాస్ అనే గొప్ప గణిత శాస్త్రజ్ఞుడు న్యూటన్ లెక్కలను సంస్కరించి, సౌరవ్యవస్థలోని యాంత్రిక సమస్యను పరిష్కరించ ప్రయత్నించాడు. న్యూటన్ గణిత సమీకరణాలు ఖగోళశాస్త్ర గణితంలో పనిచేయవని ఆయన నిర్ధారించాడు. న్యూటన్ యాంత్రిక సిద్ధాంతం ఖగోళశాస్త్రంలో కొంతవరకు బాగా పనిచేయటం గమనించిన భౌతిక శాస్త్రవేత్తలు, సాటిని ద్రవాల నిరంతర చలనానికీ, స్థితిస్థాపక వస్తువుల ప్రకంపనాలకూ అన్వయించి చూశారు. అణు సముదాయాల నిరంతర చలనంవల్ల సృజింపబడిన శక్తే ఉష్ణమని తెలుసుకొని, దానికీ ఈ సూత్రాన్ని అన్వయించారు. నీటి ఉష్ణం అధికం చేస్తే, తమని బంధించి వుంచే శక్తుల నధిగమించి వేరయిపోయి జలాణు సముదాయాలు అధిక చలనాన్ని సంతరించుకుంటాయి.

పందొమ్మిదో శతాబ్దం తొలిదశలో శాస్త్రజ్ఞులు విశ్వం అంతా ఓ పెద్ద యాంత్రిక వ్యవస్థ అనీ, అది న్యూటన్ కనుగొన్న చలన సూత్రాల పద్ధతిన నడుస్తున్నదనీ నమ్మారు. ఆ తరువాత న్యూటన్ సిద్ధాంతంలో లోపాలు కన్పించసాగాయి. ఇది ఒక్కసారిగా జరగలేదు. శాస్త్ర పురోగమనంలో మొదటి ఆవిష్కరణ విద్యుదయస్కాంతశక్తులు. వీటిని న్యూటన్ యాంత్రిక నమూనాలో వివరించటం కష్టమైంది. అవి కొత్తరకం శక్తులు. మైకేల్ ఫారడే, క్లార్క్ మాక్స్‌వెల్ లు వీటికి నాంది పలికారు. ఫారడే అయస్కాంతాన్ని రాగి చుట్టకు దగ్గరగా కదిలించి విద్యుత్తును సృజించినప్పుడు, అయస్కాంతాన్ని కదపటమనే యాంత్రిక శక్తిని విద్యుచ్ఛక్తిగా మార్చాడు. శాస్త్ర సాంకేతికతలకు అది మలుపయింది. విద్యుత్ సాంకేతిక శాస్త్రానికి పునాదులు వేస్తూనే, మాక్స్‌వెల్ ఊహా సిద్ధాంతాలకు ఊనిక ఇస్తూ విద్యుదయ స్కాంత సిద్ధాంతానికి దారితీసింది ఆ ప్రయోగం. వాళ్ళు విద్యుదయస్కాంత శక్తుల గూర్చి మాత్రమే అధ్యయనం చెయ్యలేదు. శక్తే వాళ్ళ ప్రథమ పరిశీలనాంశమయింది. శక్తిసిద్ధాంతానికి బదులు శక్తి క్షేత్ర సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టి, న్యూటన్ ఆలోచనలను దాటి ముందుకడుగేశారు.

న్యూటన్ తన యాంత్రిక వాదంలో రెండు రాశులు ఒకదాన్నొకటి ఆకర్షిస్తాయన్నారు. అందుకు భిన్నంగా ఫారడే మాక్స్‌వెల్ లు ప్రతి విద్యుదావేశం చుట్టూవున్న ప్రదేశంలో ఓ అలజడిని, లేదా పరిస్థితిని సృజిస్తుందని చెప్పారు; ఆ పైన రెండో రకపు విద్యుదావేశం – ధన ఋణ విద్యుదావేశాలు – ఆ శక్తిని అనుభూతం చేసుకుంటుందనీ చెప్పారు. శక్తిని ప్రభవింప చేయగలిగిన స్థల పరిస్థితిని వాళ్ళు క్షేత్రమని పిల్చారు. ఏక విద్యుదావేశమున్నా అది వుంటుంది, దాని ఫలితాన్ని తెలుసుకోవటానికి రెండో విద్యుదావేశాన్ని సమకూర్చకపోయినా, దాని ఉనికి దానికి వుంటుంది.

భౌతిక సత్యానుభవంలో ఇది గొప్ప సంచలనమయింది. న్యూటన్ సిద్ధాంతంలో శక్తి

వస్తుసంబంధితమైతే, ఇక్కడ భౌతిక వస్తువుల సంబంధం లేని క్షేత్ర సిద్ధాంతం ప్రతిపాదించటంతో భౌతికశాస్త్రంలో మహా పురోగతిని సాధించటమయింది. దీని పతాకస్థాయి విద్యుచ్ఛలనశాస్త్రం (Electrodynamics). స్పేస్ గుండా వేగంగా ప్రయాణించే విద్యుదయస్కాంత క్షేత్ర పర్యాయాలే 'కాంతి' అని ఆ శాస్త్రం చెప్తోంది. ఇవాళ మనకు తెల్సు – రేడియో తరంగాలు, కాంతి తరంగాలు, ఎక్స్–రే తరంగాలు అన్నీ కూడా విద్యుదయస్కాంత తరంగాలేననీ; చలించే విద్యుదయస్కాంత క్షేత్రాల పౌనఃపున్య ప్రకంపనాల భేదమే అనీ.

ఇన్ని మార్పులొచ్చినా న్యూటన్ యాంత్రిక వాదం నశించిపోలేదు. మాక్స్‌వెల్ కూడా తన ఫలితాలను యాంత్రిక పరిభాషలో వ్యక్తపరచ ప్రయత్నించాడు. ఈథర్ అనే లైట్ – స్పేస్‌ని నింపే మాధ్యమంలో ఏర్పడే యాంత్రిక వత్తిడే ఈ క్షేత్రాలనీ, పునఃస్థాపక శక్తి గలిగిన ఈథర్ అలలే విద్యుదయస్కాంత తరంగాలనీ చెప్ప ప్రయత్నించాడు. అయితే ఈయన మాటలెవ్వరూ అంతగా పట్టించుకోలేదు. చివరకు యాభై సంవత్సరాల తరువాత ఐన్‌స్టీన్ ఈథరనేది లేదనీ, విద్యుదయస్కాంత క్షేత్రాలు భౌతికధర్మాలుగా వాటి స్వంత ప్రతిపత్తి వాటికి వుందనీ, అవి ఖాళీ స్పేస్‌లో ప్రయాణించగలవనీ, యాంత్రికంగా వాటిని విశదీకరించటానికి వీల్లేదనీ ఖండితంగా చెప్పాడు.

ఇరవయ్యో శతాబ్దం ప్రారంభానికల్లా, శాస్త్రజ్ఞులకు రెండు సిద్ధాంతాలున్నాయి. అవి న్యూటన్ యాంత్రికవాదం, మాక్స్‌వెల్ విద్యుచ్ఛలన శాస్త్రం. న్యూటన్ యాంత్రిక నమూనా మొత్తం భౌతిక శాస్త్రానికే ఆధార భూతంగా ఎంతోకాలం కొనసాగలేకపోయింది.

## ఆధునిక భౌతికశాస్త్రం :

ఈ శతాబ్దపు మొదటి మూడు దశాబ్దాల్లో భౌతికశాస్త్రంలో మౌలికమయిన మార్పులొచ్చాయి. పూర్ణ స్థల కాలాలు, మౌలిక ఘనపరిమాణ రేణువులు, భౌతిక వస్తువుల స్పష్ట కార్యకారణ సంబంధం, ప్రకృతిని గూర్చిన వస్త్వాశ్రయ వర్ణనలాంటి పాత భావాలకు స్వస్తిపలకటం జరిగింది.

ఆధునిక భౌతికశాస్త్ర ప్రారంభ దశలో అసాధారణ ప్రజ్ఞాధురీణతను ప్రదర్శించింది ఒకే ఒక్క మనిషి. ఆయనే ఆల్బర్ట్ ఐన్‌స్టీన్. ఆయన 1905లో రాసిన రెండు పత్రాల్లో రెండు విప్లవాత్మక ఆలోచనాధారలకు నాంది పలికారు: మొదటిది ప్రత్యేక సాపేక్ష సిద్ధాంతం; రెండోది విద్యుదయస్కాంత ప్రసారంలో క్రొంగొత్త దర్శనం. ఇది ఆ తరువాత పరిమాణ సిద్ధాంతానికి (Quantum theory) దారితీసింది. ఆ తరువాత ఇరవై సంవత్సరాలకు భౌతిక శాస్త్రజ్ఞుల బృందం పూర్తి పరిమాణ సిద్ధాంతానికి రూపకల్పన చేశారు. అయితే సాపేక్ష సిద్ధాంతానికి ఐన్‌స్టీనే పూర్తి రూపమిచ్చాడు.

ఐన్‌స్టీన్ ప్రకృతిలోని సామరస్యాన్ని నమ్మిన మనిషి; భౌతికశాస్త్రం మొత్తానికీ ఒకే పునాది ఏర్పరచాలని ప్రయత్నించాడు. తన జీవిత కాలమంతా యాంత్రిక వాదాన్నీ, విద్యుచ్ఛలన శాస్త్రాన్నీ ఒకే చట్రంలో బంధించ ప్రయత్నించటంతో ప్రభవించింది ఆతని సాపేక్ష సిద్ధాంతం. ఈ సిద్ధాంతం ప్రకారం స్పేస్ మూడు డైమెన్షన్‌లదే కాదు, కాలంతో కలిసి

అది నాలుగు డైమెన్షన్లదవుతుంది. అందువల్ల సాపేక్ష సిద్ధాంతంలో కాలాన్ని గురించి మాట్లాడకుండా స్పేస్‌ను గురించి మాట్లాడలేం; అలాగే స్పేస్‌ను గురించి మాట్లాడకుండా కాలాన్ని గురించి మాట్లాడలేం. భిన్న పర్యవేక్షకులు భిన్నవేగంతో కదిలినప్పుడు ఒకే కాలంలో భిన్నమైన సంఘటనలు చూడగలరు. ఆ సందర్భంలో ఒక పర్యవేక్షకుడికి రెండు సంఘటనలు ఒకేసారి జరుగుతున్నట్టు కన్పించినవి. మరికొందరు పర్యవేక్షకులకు విభిన్న కాలాల్లో జరుగుతున్నట్లు కన్పించవచ్చు. అలా కాలాన్ని, స్పేస్‌నీ కొల్చే అన్ని కొలతలూ వాటి పరిపూర్ణతను కోల్పోయాయి.

స్పేస్–టైం అనే భావాలు ప్రాకృతిక స్వభావాన్ని వర్ణించటానికి యెంతగా ఆధార భూతాలయ్యాయంటే, వాటి మార్పు మొత్తం ప్రకృతి చట్రాన్నే మార్చి వేసింది. ఈ మార్పువల్ల ఒనగూడిన ఫలితం రాశిని శక్తిగా గుర్తించటం. వస్తువు స్థిరంగా వున్నా దాని రాశిలో శక్తి నిలవవున్నది. ఈ రెండింటి మధ్య వున్న సంబంధం ప్రఖ్యాత సమీకరణం $E = mc^2$ లో వ్యక్తీకరించబడింది. అందులో E శక్తి అయితే, M రాశి, C కాంతివేగం.

ఈ స్థిరమైన కాంతివేగం సాపేక్ష సిద్ధాంతానికి ప్రాముఖ్యతను కలిగించింది. కాంతివేగంతో కదిలే భౌతిక వస్తుచయాన్ని గూర్చి వర్ణించేటప్పుడు మనం సాపేక్ష సిద్ధాంతాన్ని అన్వయించాల్సి వస్తుంది. విద్యుదయస్కాంత ప్రకృతిని అభివర్ణించేటప్పుడూ ఇది అవసరమే. 1915లో ఐన్‌స్టీన్ తన సాధారణ సాపేక్ష సిద్ధాంతాన్ని – ఈ చట్రంలో గురుత్వాకర్షణ శక్తిని కూడా కుదించి – ప్రతిపాదించాడు. ఆతని ప్రత్యేక సాపేక్ష సిద్ధాంతం అసంఖ్యాక ప్రయోగాలవల్ల ఋజువైనా, ఆతని సాధారణ సాపేక్ష సిద్ధాంతం ఇంకా పూర్తిగా నిర్ధారణ కాలేదు.

ఐన్‌స్టీన్ సిద్ధాంతం ప్రకారం స్పేస్ – టైం లను వక్రీభవించగలిగే గుణం గురుత్వాకర్షణ శక్తికుంది. అంటే ఎలా రెండు డైమెన్షన్ల జ్యామెట్రీ సమతలంపై ఉపయోగించినట్లు, గోళ ఉపరితలంపై సాధ్యం కాదో, అలాగే అలాంటి వక్రత పొందే స్పేస్‌లో సాధారణ యూక్లిడ్ జ్యామెట్రీ నిష్ప్రయోజనం. సమతలంపై $90^o$ లున్న నలుచదరాన్ని గీయవచ్చు. అదే గుండ్రని వస్తువుమీద $90^o$ లున్న చదరాన్ని సృజించటం కుదరని పని. యూక్లిడ్ జ్యామెట్రీ సూత్రాలు వక్రతలంపై పనిచేయవు. మూడు డైమన్షన్ల స్పేస్ నిజానికి వక్రత కలిగి వుందనీ, విస్తృత రాశుల గురుత్వాకర్షణ క్షేత్రం వల్ల ఈ వక్రత కలుగుతున్నదనీ ఐన్‌స్టీన్ సిద్ధాంతం చెప్తూన్నది. ఓ నక్షత్రం లేక గ్రహంలాంటి మహారాశీకృత వస్తువు చుట్టూ స్పేస్ వంకరగా వుంటుంది. ఆ వక్రతా కోణం వస్తురాశిపై ఆధారపడి వుంటుంది. సాపేక్ష సిద్ధాంతంలో టైంను స్పేస్‌నుండి వేరుచేయలేం కనుక వస్తు అస్తిత్వంవల్ల టైం కూడా ప్రభావితమయి, విశ్వంలోని భిన్న భాగాల్లో, భిన్న ప్రమాణాలలో ప్రవహిస్తూ వుంటుంది. అలా ఐన్‌స్టీన్ సాధారణ సాపేక్ష సిద్ధాంతం పూర్ణ టైం, స్పేస్ భావనను పూర్తిగా ఖండిస్తుంది. స్పేస్‌నీ, కాలాన్నీ కొల్చే అన్ని ప్రమాణాలూ సాపేక్షకాలే కాదు, స్పేస్ – టైంల నిర్మాణమంతా విశ్వంలో రాశి ఏర్పాటైన విధానం మీద ఆధారపడి వుంటుంది. అలా ఖాళీ స్పేస్ అనే భావానికి అర్థం లేకుండా పోయింది. ఘన పరిమాణ వస్తువులు ఖాళీ స్థలంలో పరిభ్రమిస్తాయన్న భావంపై సంప్రదాయ భౌతిక శాస్త్రపు యాంత్రిక ప్రాపంచిక దృష్టి ఆధారపడివుంది. అయితే మన నిత్యానుభవ జీవితంలో అది ప్రయోజనకారి అయిన సిద్ధాంతమే. ఖాళీస్థలం, ఘన పరిమాణం గల వస్తువులు – లాంటి భావాలు మన జీవితంలో ఎంతగా స్థిరపడిపోయాయంటే,

అవి అన్వయించలేని భౌతిక సత్యాన్ని నమ్మటం చాల కష్టమవుతుంది. కాని ఆధునిక భౌతికశాస్త్రం ఇదే చెప్తోంది. ఖాళీ స్థలం అనే భావన ఖగోళ భౌతికశాస్త్రంలో, విశ్వశాస్త్రంలో అర్థం లేనిదయింది. ఘన పరిమాణంగల వస్తువులనే భావనను అణుభౌతిక శాస్త్రం వమ్ము చేసింది.

సంప్రదాయ భౌతికశాస్త్ర పరిభాషలో వివరించలేని ఎన్నో అణు నిర్మాణ సంబంధ విషయాలు ఈ శతాబ్దపు మలుపులో ఆవిష్కరింపబడ్డాయి. ఎక్స్–రేల ఆవిష్కరణతో అణువులకో రూపముందని తెలిసింది. అణుధార్మిక శక్తికలిగిన పదార్థాల నుండి వెలువడే కిరణాల సంగతి తెలియగానే, అణు ధార్మిక ద్రవ్యాలు రకరకాల కిరణ ప్రసారం చేయటమేకాక, అవి భిన్న ద్రవ్యాల అణువులుగా రూపుమార్చుకోగలవనీ తెలిసింది. దీంతో ఈ ఆవిష్కరణ లనే పనిముట్లుగా వాడి, మరింత జ్ఞానశోధనకై ప్రయత్నించడం జరిగింది. మాక్స్‌వాన్ లూయీ స్పటికాల్లో అణువుల నిర్మాణాన్ని గూర్చి ఎక్స్–రేల ద్వారా అధ్యయనం చేశాడు; ఎర్నెస్ట్ రూథర్‌ఫర్డ్ అణుధార్మిక ద్రవ్యాల నుండి వెలువడే ఆల్ఫా రేణువులు పరమాణు ఆకృతి కలిగినవనీ, అవి మహావేగం కలిగిన పదునైన బాణాల్లాంటివనీ, వాటితో అణు అంతర్భాగాన్ని శోధించవచ్చుననీ కనుగొన్నాడు.

రూథర్‌ఫర్డ్ ఆల్ఫా రేణువులతో అణువును ఛేదించినప్పుడు, అంతకు మున్నెన్నడూ ఊహించని సత్యాలు బయటపడ్డాయి. ప్రాచీనకాలం నుండి అణువులను కఠినీకృత ఘనరేణువు లుగా భావించారు. తద్భిన్నంగా వాటిల్లో అనంతమైన ఆకాశం (space) వుంది. దాంట్లో మహా సూక్ష్మరేణువులు – ఎలక్ట్రాన్లు – పరమాణు కేంద్రం చుట్టూ, విద్యుత్ శక్తితో దానికి బంధింపబడి తిరుగుతున్నాయి, సూర్యుడి చుట్టూ పరిభ్రమించే గ్రహాల పద్ధతిలో. అణు వులో ఈ నమూనా బయటపడగానే, ఓ మూలకం (Element) లోని ఎలక్ట్రానుల సంఖ్య ఆ మూలకపు రసాయన ధర్మాలను నిర్ణయిస్తుందని తెల్సింది. అలా అణుభౌతిక శాస్త్రపు సూత్రాల ఆధారంగా మొత్తం రసాయన శాస్త్రాన్నే రూపించవచ్చు.

అయితే ఈ సూత్రాన్ని గుర్తించటం మాత్రం అంత తేలిగ్గా కాలేదు. 1920లో అంతర్జాతీయ శాస్త్రజ్ఞుల బృందం వీటిని గుర్తించింది. ఈ భౌతిక శాస్త్రజ్ఞులు ప్రతిసారీ ప్రకృతిని ప్రశ్నవేసినప్పుడల్లా, ప్రకృతి ఒకదానికొకటి పొసగని విధంగా సమాధాన మిచ్చింది; వాళ్ళు పరిస్థితి స్పష్టీకరించే ప్రయత్నం చేసినకొద్దీ ఈ విపరీతార్థాలు మరింతగా దృగ్గోచరమ య్యాయి. అణుభౌతిక శాస్త్రంలో అంతర్గతంగా నిహితమైవున్న విపరీతార్థాలుగా వాటిని స్వీకరించటానికీ, సంప్రదాయ భౌతికశాస్త్ర పరిభాషలో వాటిని వ్యక్తీకరించే అన్ని ప్రయత్నా ల్లోనూ ఆ విపరీతార్థాలు ఉద్భవిస్తాయని గుర్తించటానికీ ఈ శాస్త్రజ్ఞులకు చాలా కాలం పట్టింది. ఒకసారి జ్ఞానం కలగ్గానే, శాస్త్రజ్ఞులు సరైన ప్రశ్నలు వేయటం నేర్చుకున్నారు. వైరుధ్యాల నుండి బయటపడగలిగారు. వాళ్ళ ఆ పరిశోధనే పరిమాణ సిద్ధాంతంగా గణిత సమీకరణ రూపంలో వెలువడింది.

గణితశాస్త్రబద్ధ సమీకరణల్లో పరిమాణ సిద్ధాంతం వెలువడ్డా, దాన్ని ఆమోదించటం కష్టమయింది. కారణం భౌతిక శాస్త్రవేత్తల ఊహలని ఛిన్నాభిన్నం చేసే విధంగా సత్యాలు వెలివడటం. రూథర్‌ఫర్డ్ పరిశోధనలో, అణువులు కఠినమైనవీ అభిన్నమైనవన్న పాత

భావనకు స్వస్తి పలుకుతూ, వాటిల్లో అనంతాకాశముందనీ, వాటిల్లో సూక్ష్మరేణువులు సంచరిస్తున్నాయనీ తెలిస్తే, పరిమాణ సిద్ధాంతం సంప్రదాయ భౌతిక శాస్త్ర పరిభాషలో చెప్పేటట్లు అవి ఘనరేణువులే కాదని తెలియచెప్పింది. ఈ సిద్ధాంతంలో, ఈ పరమాణు వస్తు విభాగాలు అమూర్తాలుగా, ద్విరూపులుగా కన్పించాయి. మన దృష్టిపై ఆధారపడి, అవి ఒకోసారి రేణువులుగా, మరోసారి తరంగాలుగా దర్శనమిచ్చాయి. కాంతిలో ఈ ద్విరూపత్వం – విద్యుదయస్కాంత తరంగాలుగా, రేణువులుగా దర్శనమిచ్చింది.

ఈ కాంతి, పదార్థాల ద్విరూపధర్మం చాలా విచిత్రమైంది. ఒకేసారి అది రేణువుగా – అంటే కొంత పరిమాణంలో బంధింపబడగలిగేదిగానూ, తరంగంలా – అంటే ఎంతో స్థలంలో వ్యాపించగలిగేదిగానూ ఊహించటం చాల కష్టమైంది. వైరుధ్యాల నుండి పుట్టిందే పరిమాణ సిద్ధాంతం. మాక్స్ ప్లాంక్ ఉష్ణప్రసరణ శక్తి నిరంతరం వెలువడదనీ, ముద్దలు ముద్దలుగా వెలువడుతుందనీ కనుగొన్నారు. ఐన్‌స్టీన్ ఈ ముద్దలనే 'పరిమాణం' (Quanta) అని పిల్చాడు; వాటిని ప్రకృతి ప్రాథమిక లక్షణంగా భావించాడు; కాంతిగాని, లేక ఏ విద్యుదయస్కాంత ప్రసారంగాని తరంగ రూపంలోనే కాక, ఈ ముద్దల రూపంలోనూ కన్పించవచ్చని సిద్ధాంతీకరించాడు. ఈ వెలుగు ముద్దలనే ఇప్పుడు 'ఫొటాన్స్' అని పిలుస్తున్నాం. అవి ప్రత్యేక రకానివి; రాశి రహితమైనవీ, కాంతి వేగంతో ప్రయాణించేవీ అవి.

ఈ వైరుధ్యం-రేణువు, తరంగం మధ్య వున్న వైవిధ్యం-అనుకోకుండా పరిష్కారమయింది. ఇది ప్రపంచ యాంత్రికదృష్టిని – పదార్థ నిత్యత్వాన్ని ప్రశ్నించింది. పరమాణు స్థాయిలో, పదార్థానికి నిశ్చిత నిర్దిష్ట ప్రదేశపు అస్తిత్వం వుండదు; కాని 'అస్తిత్వోన్ముఖత' (Tendency to exist) ను ప్రదర్శిస్తుంది; ఆపైన అణు సంఘటనలు నిశ్చయంగా, నిర్ణీత కాలంలో, నిశ్చిత మార్గంలో సంభవించవు; కాని సంభవోన్ముఖతల (Tendencies to occur) ను కలిగివుంటాయి. పరిమాణ సిద్ధాంత రూపకల్పనలో, ఈ ఉన్ముఖత్వాన్ని సంభవాలుగా వ్యక్తీకరించటం జరిగింది; గణిత పరిమాణాలలో తరంగ రూపాన్ని సంతరించుకోవటం జరిగింది. అలా రేణువులు, అదే సమయంలో తరంగాలూ అయ్యాయి. అవి శబ్ద, జలతరంగాల్లాగా మూడు డైమెన్షన్ల 'నిజ' తరంగాలు కావు. అవి 'తరంగ సంభవాలు'. ఓ ప్రత్యేక స్థలంలో, సమయంలో రేణువులుగా సంభవించగలిగే తరంగ లక్షణ ధర్మం కలిగిన అమూర్త గణిత పరిమాణాలవి. అణు భౌతిక శాస్త్రపు సూత్రాలనన్నింటినీ ఇలాంటి సంభవాల పరిభాషలో వ్యక్తీకరించటం జరిగింది. ఓ అణు సంఘటన నిశ్చయంగా ఎప్పుడు సంభవిస్తుందో మనం చెప్పలేం; అది ఎలా సంభవించటానికి అవకాశం వుందో మాత్రం చెప్పగలం.

అలా పరిమాణ సిద్ధాంతం ఘన పరిమాణ వస్తువులన్న సంప్రదాయ భావాన్నీ, ఖచ్చితమైన ప్రాకృత నియతవాద సూత్రాన్నీ ఛేదించింది. పరమాణు స్థాయిలో, సంప్రదాయ భౌతికశాస్త్రంలోని ఘన పరిమాణ వస్తువులన్నీ, తరంగరూప సంభవ చిత్రాలుగా మారిపోతాయి; ఆపైన, చివరకు, ఈ చిత్రాలు వస్తు సంభవాలకూ ప్రాతినిధ్యం వహించవు; ఆంతరిక సంబంధ సంభవాలకు ప్రాతినిధ్యం వహిస్తాయి. అణు భౌతికశాస్త్రంలో ఈ పరమాణు రేణువులు ఒంటరి పరిమాణాలన్న అర్థం లేదు; ఓ ప్రయోగం సంసిద్ధం చేయటం తదుపరి కొలవటం

మధ్య వున్న ఆంతరిక సంబంధంగానే అర్థం చేసుకోవాల్సి వుంటుంది. అలా పరిమాణ సిద్ధాంతం విశ్వపు ప్రాథమిక ఏకత్వాన్ని గురించి చెప్తోంది. ప్రపంచాన్ని స్వంత అస్తిత్వం వున్న చిన్న చిన్న ముక్కలుగా విడగొట్టలేమని అది చెప్తుంది. మనం ద్రవ్యంలోకి తొంగి చూసినప్పుడు ప్రకృతి మనకు ప్రాథమిక నిర్మాణ విభాగాలుగా కన్పించదు; మొత్తంలోని వివిధ భాగాల మధ్య వున్న సంక్లిష్ట సంబంధ చిత్రం మనకు కన్పిస్తుంది. ఈ సంబంధాలు పర్యవేక్షకుడిని ఎప్పుడూ తమతో కలుపుకునే వుంటాయి. ఈ పర్యవేక్షణా శృంఖలంలో, మానవ పర్యవేక్షకుడు చివరి సంధి అవుతాడు; ఏ అణువస్తు ధర్మమయినా పర్యవేక్షకుడితో వస్తువుకున్న సంబంధ పరిభాషలో మాత్రమే వ్యక్తమవుతుంది. సంప్రదాయ పద్ధతిలో ప్రకృతిని వస్త్వాశ్రయ పద్ధతిన వర్ణించగలమన్న భావం పనికిరానిదయింది. డికార్తే చేసిన విభాగం – అహం, ప్రపంచం – పర్యవేక్షకుడు, పర్యవేక్షణా వస్తువు – మధ్య అంతరం అణుద్రవ్యంతో వ్యవహరించేటప్పుడు నిష్ప్రయోజనకారి అయింది. అణుభౌతిక శాస్త్రంలో, మనల్ని గురించి మాట్లాడకుండా మనం ప్రకృతిని గూర్చి మాట్లాడం.

రూథర్‌ఫర్డ్ గ్రహనమూనా వ్యక్తపర్చలేని అణు నిర్మాణ సమస్యలనెన్నిటినో ఈ కొత్త అణు సిద్ధాంతం పరిష్కరించగలిగింది. మొదటిగా రూథర్‌ఫర్డ్ ప్రయోగాలు, ద్రవ్యాణువులు, ద్రవ్య వ్యాప్తికి సంబంధించినంతవరకు, అనంతాకాశాన్ని కలిగివున్నాయని చెప్పాడు. కాని మన చుట్టూ వున్న వస్తువులు, మనం, ఖాళీ జాగాలమయితే, మనం మూసివున్న తలుపుల గుండా ఎందుకు నడవలేం? అంటే ద్రవ్యానికి ఘనపరిమాణాన్నిచ్చేదేది?

రెండో సమస్య అణువుల అసాధారణ యాంత్రిక స్థిరత్వం. ఉదాహరణకు, గాల్లో అణువులు ప్రతి క్షణం కోట్లాదిసార్లు ఢీకొని, ఢీకొన్న తరువాత ప్రతిసారీ మామూలు స్థాయికి వస్తున్నాయి. ఏ గ్రహ వ్యవస్థ ఢీకొన్న తరువాత, సంప్రదాయ యాంత్రిక సూత్రాల ప్రకారం, మార్పు పొందకుండా వుండదు. కాని ఓ ఆమ్లజని అణువు ఎన్నిసార్లు ఢీకొన్నా దాని విలక్షణ ఎలక్ట్రాన్ రూపచిత్రాన్ని పోగొట్టుకోదు; ఒకే జాతి అణువుల రూపచిత్రం ఎప్పుడూ ఒకటిగానే వుంటుంది.

ఆశ్చర్యంగొల్పే ఈ అణుధర్మం ఎలక్ట్రానుల తరంగ ప్రకృతి నుండి ఒనగూడుతున్నదని పరిమాణ సిద్ధాంతం చెప్తోంది. ద్రవ్య ఘనపరిమాణ లక్షణం, ద్విరూప – తరంగ/రేణు ద్రవ్య లక్షణం, ఓ ప్రత్యేక పరిమాణ చర్య ఫలితంగా ఒనగూడుతున్నది. ఏ రేణువునయినా కొద్ది జాగాలో బంధించితే అది చలించటం ద్వారా తన వ్యతిరేకతను (ప్రతిచర్యను) చూపెడుతుంది. బంధించబడిన స్పేస్ తక్కువైన కొద్దీ, రేణువులు దానిచుట్టూ మరింత వేగంగా తిరుగుతాయి. అణువులో రెండు పోటీపడే శక్తులున్నాయి. ఒకవైపు విద్యుచ్ఛక్తి ద్వారా ఎలక్ట్రాన్‌లు న్యూక్లియస్‌కు బంధింపబడి వున్నాయి. న్యూక్లియస్ వాటిని చాల దగ్గరగా బంధించి వుంచుతోంది. మరోవైపు ఈ బంధనానికి ప్రతిగా అవి దాని చుట్టూ మహా వేగంతో తిరుగుతాయి. బలంగా, మరింత దగ్గరగా న్యూక్లియస్ వాటిని పట్టి వుంచిన కొద్దీ, అవి మరింత వేగంగా దాని చుట్టూ తిరుగుతాయి. నిజానికి ఈ జైలు బంధనం ఎలక్ట్రానును సెకండుకు 600 మైళ్ళ వేగంతో చలించేటట్లు చేస్తుంది. వేగంగా తిరిగే ప్రొపెల్లరు ఎలా ఒట్టి దిమ్మెగా కన్పిస్తుందో, అలాగే అణువును ఈ మహావేగం ఘనాకారగోళంగా భాసింప చేస్తుంది. ఈ అణువులను ఇంకా కుదించలేం.

# ధోరణి

- డా॥ సంజీవదేవ్

ఎక్కడ నుంచి రావడం?
ఇంకెక్కడనుంచి, అక్కడనుంచే
అక్కడ అంటే ఎక్కడ?
అక్కడ అంటే ఇక్కడ కానిది
అక్కడ నుంచి రావటం నడకతోనేనా?
కాళ్లున్నవాళ్లు నడచిరాక ఎగిరి వస్తారా?
కొంగలకు కాళ్లున్నాయి, అయినా అవి ఎగిరే వస్తాయిగా!

వాటికి రెక్కలున్నాయి కనుక ఎగిరి వస్తాయి.

నావి పనిచేసే రెక్కలేకాని ఎగిరే రెక్కలు కావు.

అవును, మనిషి రెక్కలు పని చేస్తాయే కాని స్వయంగా ఎగరలేవు. కాని అవి స్వయంగా ఎగర లేకపోయినా, ఎగిరే రెక్కలను, అంటే విమానాలను తయారుచేస్తాయి.

సరే, పోనీయండి; ఏ విధంగా వచ్చారనేది ప్రధానం కాదు, అసలు రావటం అనేది ప్రధానం, మొత్తం మీద వస్తామని చెప్పి మాట తప్పకుండా వచ్చారు. అదే పదివేలు. వస్తామని చెప్పి అనేకమంది రారు. రాము అని చెప్పివచ్చినా బాగుంటుంది కాని వస్తామని చెప్పి రాకపోవటం సుతరామూ బాగుండదు.

సరే, ఈ సంగతుల కేమొచ్చెగాని ఆ మధ్య మీ ఇంట్లో ఎవరికో జబ్బు చేసిందని విన్నాను. ఎవరికో తెలియలేదు. ఆ జబ్బు ఎవరికో, ఏమి మందులు వాడేరో, మందులు వాడక ముందు కంటే మందులు వాడిన తరువాత వ్యాధి ఇంకా ఎక్కువ అయినదేమో కూడ తెలియదు.

ఆ జబ్బు సంగతా? ఇంకా ఎవరికి వస్తుంది ఆ జబ్బు? మా గృహిణికే. అది రక్తపోటు వ్యాధి అట. ఫారిన్ నుంచి తిరిగివచ్చిన డాక్టరే ప్రస్తుతం ఆమెకు చికిత్స చేస్తున్నాడు. ఫారిన్‌కు పోకుండా ఉన్న డాక్టర్ అదివరలో మందులు వాడితే కొంత తగ్గింది.

మరి ఇపుడు బాగా తగ్గి ఉండాలి.

ఆవిధంగా జరిగితే బాగానే ఉండేది. కాని అందుకు వ్యతిరేకం జరిగింది. ఆ ఫారిన్ నుంచి వచ్చిన డాక్టర్ చేత చికిత్స మొదలు పెట్టించాం. అది మొదలు వ్యాధి ఇదివరక్కంటే ఎక్కువయింది. ఆ మందులు ఫారిన్ రోగులమీద తప్ప ఇండియన్ రోగుల మీద అంతగా పని చేయవు కాబోలు. ఇంగ్లీషు మాట్లాడే రోగులమీద తప్ప ఇతర్లమీద అంతగా ఆ మందుల ప్రభావం ఉండదు కాబోలు.

మరి తరువాత ఏమైంది?

ఏమవుతుంది? ఫారిన్ పోనట్టి పాత డాక్టరే తిరిగి చికిత్స ప్రారంభించాడు. దానితో వ్యాధి చాలావరకు తగ్గి ప్రస్తుతం ఆరోగ్యంగానే ఉంటున్నది. అయినా, ఆమెకు సంతృప్తిగా లేదు. ఫారిన్ డాక్టర్ ద్వారా వ్యాధి ఎక్కువైనా ఇష్టమేకాని ఇక్కడి డాక్టర్ ద్వారా తగ్గిపోవటం ఆమెకు ఏమాత్రమూ ఇష్టంలేదు. అక్కడి డాక్టర్ చికిత్సతో రోగం ఎక్కువ కావడం ఆమె దృష్టిలో రోగం తక్కువ కావటం అనే. ఇక్కడి డాక్టర్ చికిత్సతో తన వ్యాధి ఎక్కువైపో తున్నట్లు ఆమెకు అనిపించేది.

బాగుంది, ఎవరి చికిత్సతో అయినప్పటికీ వ్యాధి తగ్గటం, ఆరోగ్యం పెరగటం అనేవి ప్రధానం. ఇప్పటికి తగ్గిపోయింది కనుక మాకూ మీకూ, ఆమెకూ కూడా సంతోషం. సరే, ఆ సంగతులు అట్లాఉంచండి, అబ్బాయిలు ఏమిచేస్తున్నారు?

మీకు మతిమరుపు వచ్చినట్లుంది సుమా? మాకు అబ్బాయిలు ఎక్కడున్నారండీ, ఇద్దరూ అమ్మాయిలే అని మీరెరుగుదురుకదా?

ఆ, ఎరుగకేమి? నేను అనటంలో పొరపడ్డాను. అమ్మాయిలు అనబోయి అబ్బాయిలు అన్నాను. అంటే, అయినా, ఎవరైతే ఏమిలెండి. ఇద్దరూ మీ పిల్లలే, నిజం చెప్పాలంటే నాకు అబ్బాయిల మీదకంటే అమ్మాయిల మీదే ఎక్కువ ఇష్టం. ఎవరైనా ఎల్లకాలం ఈ భూమిమీద శాశ్వతంగా నిలచి ఉండరు.

మీరు భలేవారండీ. అబ్బాయిల మీద కంటే అమ్మాయిల మీదనే మీకు ఎక్కువ ఇష్టం అనటం నాకు నచ్చలేదు. అదేవిధంగా అమ్మాయిల మీదకంటే అబ్బాయిలమీద ఎక్కువ ఇష్టం అన్నా కూడ నాకు నచ్చదు. రెండూ కూడ పక్షపాత దృష్టులే. ఒకరికంటే మరొకరికి ఎక్కువ విలువ ఇవ్వటం అవుతుంది, పక్షపాతం ముదిరితే పక్షవాతం సంక్రమిస్తుందంటారు. ఆడపిల్లలూ మొగపిల్లలూ కూడ మనకు సమానంగా నచ్చాలి.

అవునవును, మీరు చెప్పినదానితో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. అసలు నాకు పక్షవాత రోగం అంటేనే మహాభయం. కాలుపోయి చెయిపోయి నోరుపోయి ఎన్నోనాళ్లు మంచంలో పడి ఉండటం కంటే త్వరలో మరణించటం మహామంచిది.

అవును, పక్షవాతంకంటే అవాంఛనీయమైన వ్యాధులు విరళంగా మాత్రమే ఉంటాయి. అటువంటి భయానకమైన వ్యాధిని గురించి మీరు భయపడటం అహేతుక మేమీకాదు. ఈ అర్థంలో మీది పూర్ణ హేతువాదమే.

మీరు అన్నట్లుగా పక్షవాతం రాకుండా కాపాడుకోటానికి పక్షపాతం ఉండకుండా పోవాలి. కేవలం మొగపిల్లల మీదో, కేవలం ఆడపిల్లల మీదో ఇష్టం ఉండటం అనే పక్షపాతాన్ని పెంచుకొని నానాయాతన పడటం కంటే ఆడపిల్లల్నీ మొగపిల్లల్నీ సమాన దృష్టితో చూడడం అలవరచుకుంటాను.

చాలా మంచి పనండీ మీ నిర్ణయం. పక్షవాతం మీద మీకున్న భయం మీలో ఇటువంటి సమదృష్టిని కలిగించటం ఎంతో ఆనందకర విషయం. కొన్ని జబ్బులు జీవితాలను నాశనం చేస్తున్నప్పటికీ ఆ జబ్బుల మీద పెరిగిన భయం అనేది కొన్ని జీవితాలకు వెలుగు నిస్తాయనే సత్యాన్ని మీ జీవితంలో చూస్తున్నాను నేను.

అటువంటి విలువైన సత్యాన్ని మీరు నా జీవితంలో దర్శించినందుకు మిమ్మ ఏమనాలో తెలియకుండా ఉన్నది.

ఏమనాలో తెలియనప్పుడు ఏమీ అనకుండానే జాగ్రత్తపడండి. అంతేకాని నన్ను భూషించటం అనే నెపంతో దూషించబోకండి. తెలుగులోనే కాదు, ప్రతి భాషలో కూడ కొన్ని మాటలుంటాయి వ్యంగ్యంగా. వాటిని తెలివిగా వాడితే దూషణ భూషణలు రెండూ కూడ ప్రత్యక్షమవుతాయి వాటి ద్వారా. అందుకే మిమ్మ నన్ను మంచి మాటకాని చెడ్డమాట కాని ఏమీ అనవద్దని.

సరే, ఇంతవరకూ మీరు నన్ను అడగటం, నేను చెప్పటం సరిపోయింది. ఇప్పుడు ఇక మిమ్మ నేను అడగటం, మీరు చెప్పటం జరగాలి.

అయ్యో, అదేమిటి, మీరు అడగండి, నేను చెపుతాను. నాలుక ఉన్నది పదార్థాలను రుచి చూట్టానికి మాత్రమే కాక పదాన్ని పలకటానికి కూడ. జవాబులు చెప్పటానికే కాక ప్రశ్నలు అడగటానికి కూడ. నిజం చెప్పాలంటే ప్రశ్నలు అడగటమే కష్టం, జవాబులు చెప్పటం అంతగా కష్టం కాదు. అందుకే భగవద్గీతలో కృష్ణుడి జవాబుల కంటే అర్జునుడి ప్రశ్నలే గొప్పవి అంటారు. రెండూ కూడ గొప్పవే అని కొందరంటే రెండూ కూడ గొప్పవి కావని మరికొందరంటారు.

అయితే, వినండి అడుగుతాను. నా మొదటి ప్రశ్న ఏమిటంటే మనిషి ఎందుకు ప్రశ్నలు అడుగుతాడు అనేది.

భలే ప్రశ్నను వేశారు ప్రశ్నను గురించిన ప్రశ్న. జవాబు దొరకటం కష్టమైన ప్రశ్న. మనిషి ప్రశ్న ఎందుకు వేస్తాడు అంటే తనలో ఉద్భవించిన జిజ్ఞాసను స్వయంగా తీర్చుకోలేక. దానికి తాను జవాబు ఇవ్వలేక ఇతర్లను ప్రశ్నిస్తాడు.

ప్రశ్నను గురించి నేనడిగిన ప్రశ్నకు మీరిచ్చిన సమాధానం నాకు నచ్చింది. అయితే, అది నాకు నచ్చినంత మాత్రాన మీ జవాబు సక్రమమైందని నాకు ఎట్లా తెలుస్తుంది? మీ జవాబు తప్పు కాదనటానికి దాఖలా ఏమిటి? తమకు నచ్చింది నిజమనీ, నచ్చంది అబద్ధమనీ నమ్మటం మొదలు పెడితే అనేక సత్యాలు అసత్యాలుగాను, అసత్యాలు సత్యాలుగాను ప్రత్యక్షం కావటానికి వెనకాడవు.

ఎంతో బాగున్నది మీరన్నది.

నేనన్నది మీకు బాగున్నదని అనటంకూడ ఎంతవరకు సత్యమో తెలియదు. బాగుండక పోయినా కూడ నన్ను సంతోషపెట్టటానికి బాగున్నదని అనవచ్చు. నిజం పలికి ఇతర్లను బాధపెట్టేకంటే అబద్ధం పలికి సంతోషపెట్టటం అనేది కొత్తదేమీ కాదు, పూర్వం నుంచీ అమలులో ఉంటూనే ఉన్నది. అయినా, మీ విషయంలో నేను మరో విధంగా భావించను. నన్ను సంతోష పెట్టటానికి మీరు పలికింది అబద్ధంకాదనీ, నిజమేననీ నమ్ముతాను.

మీకు వార్ధక్యం వస్తుంది. దానికితోడు మీ ఆరోగ్యం కూడ బాగున్నట్లు లేదు. అందువల్ల మీ ఈ జీవన సంధ్య రాత్రిగా త్వరలో మారవచ్చని మీరు ఏమైనా భయపడుతున్నారా?

భయపడటం లేదని గట్టిగా చెప్పలేనుగాని భయపడుతున్నానని కూడ అదే విధంగా చెప్పలేను. అంటే భయపడటం కొంత, భయపడకపోవడం కొంత ఉన్నదని.

భయపడటానికి, భయపడకపోవటానికీ కారణాలు ఏమై ఉంటాయంటారు? ఆ కారణాలు మీకు స్వయంగా తెలిసివుంటే తెలపండి. కొందరికి తమను గురించిన కారణాలే తమకు తెలియవు. ఆ విధంగా మీ కారణాలే మీకు తెలియని పక్షంలో వాటిని మీరు నాకు తెలిపే శ్రమ తీసుకోవలసిన పనిలేదు. ''అయ్యో అవి నాకు తెలియకపోవటం ఏమిటి'' అంటూ ప్రారంభించి మీకు తెలియని కారణాలను తెలిసినట్లు నటిస్తూ మాత్రం తెలపకండి.

అదేమిటండీ అట్లా అంటారు? నేనిదివరలో తెలియని వాటిని తెలిసినట్లు నటిస్తూ మీతో ఏమి అబద్ధాలు చెప్పి ఉన్నాను? అందుకు విరుద్ధంగా తెలిసినవాటిని తెలియనట్లు నటిస్తూ కొన్నిటిని చెప్పిఉంటాను.

అబ్బే అదేమీలేదు, మీరు అనుమానించినట్లుగా తెలిసినవి తెలియనట్లు మీరు చెప్పినట్లు కాని, వాటిని నేను విన్నట్లుకాని నాకు గుర్తు తెలియదు. నేను మీనుంచి విన్నవన్నీ మీకు తెలిసినవే అయినట్లు, విననివన్నీ మీకు తెలియనివే అయినట్లు నేను నమ్ముతూ వచ్చాను. ఒకవేళ నా నమ్మకాలు ఎండమావులు అవునేమో నేను గట్టిగా చెప్పలేను.

సరేలేండి, నేనడిగిన అసలు విషయాలను గురించి మీరింతవరకు చెప్పకుండానే దాట వేస్తూ వచ్చారు. మరణాన్ని గురించి మీ స్వవిషయాన్ని అడిగాను కదూ?

ఆ విషయమా, చెబుతాను వినండి. మరణం విషయంలో భయపడటానికీ, భయపడకపోవటానికీ ఉన్న కారణాలు అంత విశేషమైన వేమీకావు. అవి సామాన్య కారణాలే. ఈ జనన జీవన మరణాల లోకంలో ప్రధానంగా మనకు గోచరించేవి సుఖ దుఃఖాలు అనేవి. సుఖం మనకు ప్రియమైంది, దుఃఖం అప్రియమైంది. మొదటిదానికి దూరంగా ఉండటం అయిష్టం, రెండవదానికి దగ్గరగా ఉండటం అయిష్టం. ఒకదాన్ని వదలటం బాధ, రెండవదాన్ని వదలకపోవటం బాధ.

ఇంతకూ ఆ విషయంలో పర్యవసానం తేల్చి చెప్పకుండా ఏమేమో చెప్పి తప్పుకుపోతారు.

అదేమీకాదు, నేను చెప్పిన వాటిలోనే మీకు పర్యవసానం తెలిసి ఉంటుంది. తెలిసి ఉండని పక్షంలో తెలియ చెపుతాను వినండి. మరణించినందువల్ల దుఃఖాల నుంచి బయట పడుతామని, అదేమాదిరి సుఖాల నుండి కూడ బయటపడుతామని. మొదటిది సంతోషాన్ని కలిగిస్తే రెండవది కలిగిస్తుంది విచారాన్ని. అందుకే అంటాను మరణించటంలో సంతోషమూ విచారమూ రెండూ ఉంటాయని. ఒకందుకు భయమూ, మరొకందుకు, ఆనందమూ.

మీ వైఖరి నాకిపుడు బాగా అర్థమైంది. మరణాన్ని గురించిన మీ వైఖరి అందరకూ వర్తిస్తుంది. కాని మీరు సుఖాలు అనుకొనే వాటికీ ఇతర్లు సుఖాలు అనుకొనేవాటికీ బోలెడు తారతమ్యం ఉండవచ్చు. అందువల్ల ఈ విషయంలో అందరి వైఖరీ ఒకటికాదు. అందుకని సాంతం భిన్నమూ కాదు; భిన్నం అభిన్నం కూడ.

మీరు చెప్పినదంతా ఎంతో బాగున్నదండి, మరెంతో బాగున్నదండి, ఇంకెంతో బాగున్నది. బాగులేనిది అసలు అందులో లేనే లేదేమో అనిపిస్తుంది.

లేదండి, మీరు పొరపడుతున్నారు, నేను చెప్పినదంతా బాగాలేదు, కొంత మాత్రమే బాగుంది అని నేను ముమ్మాటికీ చెబుతున్నాను. కొన్ని బాగుండటాలు కొందరు చెప్పేదానిలో ఉంటే, మరికొన్ని బాగుండటాలు కొందరు వినేదానిలో ఉంటాయి. ఈ

రెంటిలో ఏ ఒకటి మాత్రమే బాగుండి రెండవది బాగుండక పోతే అంతా బాగున్నట్లు కాక కొంత బాగున్నట్లు మాత్రమే అవుతుంది. అట్లాకాక చెప్పటం వినటం రెండూ బాగుంటే అంతా బాగున్నట్లవుతుంది.

మీరు ఏది చెప్పినా సమగ్రంగా, సమీక్షాత్మకంగా చెబుతారు. కొందరికి విశ్వజ్ఞానమంతా తెలిసి ఉంటుంది కాని దాన్ని సవ్యంగా చెప్పటం తెలిసి ఉండదు. కొందరికి సవ్యంగా చెప్పటం తెలిసి ఉంటుంది కాని విషయజ్ఞత ఉండదు. కాని మీకు ఆ రెండూ ఉండడంతో మీ కథనమంతా కమనీయంగా ఉంటుంది. కొందరికి ఇతర విషయాలెన్నో తెలుస్తాయి కాని జీవితాన్ని గురించి కొన్నిమాత్రమే తెలుస్తాయి. ఏమంటారు?

ఏమంటాను? నిజమే అంటాను. నిజాన్ని నిజమనక అబద్ధం అంటానా? అబద్ధమని నేను అన్నప్పటికీ మిగతావారు అంగీకరించవద్దూ? జీవితాన్ని గురించి తెలుసుకుంటే అన్నిటిని గురించి తెలుసుకున్నట్లే; కారణం అన్నీ జీవితాన్నుంచే జన్మిస్తాయి కనుక, జీవితంలోనే జీవిస్తాయి కనుక, చివరకు జీవితంలోనే నశిస్తాయి కనుక.

జననం అంటే ఉదయం, జీవించటం అంటే మధ్యాహ్నం, మరణించటం అంటే రాత్రి. రోజులో ఈ మూడు భాగాలు సహజమైనట్లే జీవితంలో కూడ ఆ మూడు దశలు సహజమే. ఒకటి ఆది, రెండవది మధ్య, మూడవది అవసానం, ఈ మూడూ కలసే సమగ్ర జీవితం.

మాటల సందర్భంలో మీరు చాలా లోతులకు దిగిపోయారు. అంత లోతుల నుంచి తిరిగి పైకెక్కిరావటం సులభం కాదు. కనుక మనం ఇంకా లోతులకు దిగకుండా పైకి ఎక్కివచ్చి ఆగుదాం. అతిగా లోతులకు దిగితే పైకి తిరిగి ఎక్కలేనట్లే అతిగాపైకి ఎక్కితే తిరిగి భూమి మీదకు దిగటం కష్టం. కనుక ఇక్కడే ఆగి ఇక్కడి మన్నుకు సంబంధించిన విషయాల జోలికే పోదాం, మిన్ను విషయం కొంతవరకు ఆపి.

మీ గ్రామంలో పంటలు, వంటలు, పిండివంటలు మొదలైనవి ఎప్పటివలె సాగిపోతూ మీ అందరి ఆహార విహారాల్లో స్ఫూర్తిని కలిగిస్తున్నాయా?

లేదు, అవన్నీకూడ ఇదివరలో కంటే సన్నగిలినాయి. వాటన్నిటికీ మూలం పంటలు. పంటలమీదనే కదా ఆధారపడి ఉండేవి వంటలూ పిండివంటలూ కూడ? ఆహారాలు విహారాలు అంతే.

దీనంతటికీ మూలకారణం వాతావరణ వైపరీత్యమే అంటారా? కొంతవరకు అదే అయిఉంటుందేమో.

సందేహం లేదు. కొన్ని సంవత్సరాల నుండీ వాతావరణం ప్రత్యేకించి బంగాళాఖాత తీరాల్లో ఏమాత్రం పంటలకు అనుకూలంగా ఉండటంలేదు. రెండు ప్రత్యేక పద్ధతులు కనిపిస్తున్నాయి. ఈ రెండూకూడ పంటలకు హానికరమే. అతిగా వర్షాలు కురిసి వరదల్లో పైర్లు మునిగి నశించటమో లేక అసలు వర్షాలు లేక పైర్లు ఎండిపోవటమో.

అవును, మీరన్నట్లుగా ప్రకృతిలోని ఈ రెండు విధాల వైపరీత్యాలు రైతు పాలిట ఘోర శాపం అయి నిలిచాయి.

ఈ పరిస్థితుల్లో వ్యవసాయం వృత్తిగా లేనివారికి నష్టం లేనందున వారు ఆర్థికంగా ఉన్నంత స్థాయిలో ఉండటం, వ్యవసాయమే వృత్తిగా కలవారు పతనం కావటం జరుగుతూ వస్తూంది.

దీనితో ప్రజాసామాన్యం చెప్పరాని బాధలు అనుభవిస్తూంది. ఈ దుస్థితికి విరుగుడు ఏమిటో తెలియటం లేదు.

ప్రస్తుతానికి వీటిని తొలిగించే నిర్మాణాత్మక సాధనలేమీ గోచరించటం లేదు. వర్తమానపు వాస్తవాన్ని వదలి భవిష్యత్తులోని ఆశమీద ఆధారపడడమే మన ప్రస్తుత కర్తవ్యమేమో.

చూడండీ, మన ఇంటివైపు ఎవరో ఒక యువకుడు వస్తున్నాడు, మీరెరుగుదురా ఆయన్ను?

ఆయన్ను ఎరుగకేమి? మీరు ఇదివరలో ఆయన్ను చూడలేదనుకుంటాను. చాలా తెలివైనవాడు. తెలివైనవాళ్లు చాలామంది ఉన్నారు కాని తెలివికి తగ్గ మంచిదనం ఉన్న వాళ్లు మాత్రం కొద్దిమందే ఉంటారు. ఆ వచ్చే యువకుడు ఆ కొద్దిమందిలోనివాడే. తెలివితేటలు, మంచితనంతోపాటు ఆయన చాలా హాస్యజీవి కూడా.

రావోయి రా, చాలా రోజులకు కనిపిస్తున్నావు. ఎక్కడైనా ప్రయాణాలు చేసి వచ్చావా? చిక్కిపోయినావు.

అవునండీ, నన్ను మీరు చూచి చాలా దినాలయింది; నేను మిమ్ము చూడక చాలా రోజులైంది.

ఏమిటోయి, చూచి చాలారోజులైంది, చూడక చాలా రోజులైంది అనే దానికి భేదం?

ఏమీ ప్రత్యేకించి భేదం లేదండి. ఆ భేదం లేకపోవటమే దానికున్న భేదం. అన్నం తిని చాలా రోజులైంది అన్నపుడు, అన్నం తినక చాలా రోజులు అయింది అన్నపుడు కూడ చాలా రోజుల ఆకలిని చూపుతాయి, ఆ రెండు వ్యతిరేక వాక్యాలు కూడా, ఏమాత్రం భేదం లేకుండా.

ఏమిటోయి, నీవు ఏది మాట్లాడినా సత్యానికి దూరంకాని వైచిత్రితో నిండి ఉంటుంది. ఒకసారి నీవు చిక్కి ఉన్నావని నేను అంటే ''చిక్కినమాట నిజమేనండి, కాని చిక్కింది నాచేతిలోనే కాని ఇతర్ల చేతుల్లో కాదండి'' అని జవాబు ఇచ్చావు. ఏమి చమత్కారమోయి నీది!

సరే, ఈ అబ్బాయితో మాట్లాడుతూ కూచోండి, నేను సెలవు తీసుకుంటాను.

సెలవా? ఎన్నాళ్లవరకు కావాలి సెలవు?

మళ్లీ నేనిక్కడికి వచ్చేంత వరకు.

మళ్లీ వస్తారని నమ్మకమేమిటి? జీవితంలోని చాలా విషయాలు నమ్మకం లేనివే. మీరు మళ్లీ వస్తామన్న విషయం కూడ జీవితంలోదే కనుక అదీ నమ్మకం లేని విషయమే. మీరు ఈ లోపల మరణించటం జరిగితే మీరు వస్తామన్న ప్రకారం మళ్లీరారు. ఈ లోపల నేను మరణించటం జరిగితే తప్పక మళ్లీవస్తారు నా శవాన్ని చూడటానికి. అంటే మీరు మళ్లీ రావాలంటే నేను జీవించివున్నా మరణించినా కూడ తప్పక వస్తారు. కాని మీరు మరణించటం జరిగితే మాత్రం మీరురారు ఇక్కడకు. మీరు ఇక్కడకు రావటం నాకు ఇష్టం కనుక మీరు ఇక్కడికొచ్చేదాకా జీవించి ఉండాలని, మరణించవద్దనీ. ★

(సశేషం)

# తనువు మొండికేస్తే తల గదమాయిస్తోంది!

– అట్లూరి వెంకటేశ్వరరావు



మనసమస్యా పరిష్కార శక్తిని సామర్థ్యంగా గుర్తిస్తాం. సమస్యా పరిష్కార శక్తి భిన్న వ్యవస్థల చర్యల ప్రతిచర్యల పర్యవసానంగా అభివ్యక్త మౌతుంది. ముఖ్యంగా మనలోని భౌతిక వ్యవస్థ, మానసిక వ్యవస్థ సమష్టిగా సాంఘిక వ్యవస్థతో జరిపే చర్యల, ప్రతిచర్యల ఫలితంగా మన సమస్యలను పరిష్కరించుకోగలుగుతాం. మన భౌతిక వ్యవస్థ మన శరీరంలో సుమారు 98 శాతం వుంటుంది. భౌతిక వ్యవస్థలో నాడీ మండలం, రోగనిరోధక శక్తి రసాయన గ్రంథులు, జీర్ణకోశం, రక్తప్రసరణలాంటి అనేక అంతర్భాగాలు సమన్వయంతో పనిచేస్తాయి. భౌతిక వ్యవస్థ, మానసిక వ్యవస్థ అధీనంలో వుంటుంది. అనగా మన శరీరంలోని రెండు శాతం పరిమాణం గల మెదడు మిగిలిన 98 శాతాన్ని అజమాయిషి చేయగల స్థోమత కలిగి వుంటుంది. మానసిక వ్యవస్థకు మెదడు కేంద్రస్థానం. మానసిక వ్యవస్థ పటిష్టంగా వ్యవహరిస్తే, భౌతిక వ్యవస్థ సంపూర్ణ సహకారం ఇవ్వక పోయినా, మన సామర్థ్యం తగ్గదని ప్రఖ్యాత బ్రిటిష భౌతిక శాస్త్రవేత్త స్టీఫెన్ హాకింగు జీవిత చరిత్ర నిరూపిస్తోంది.

1942 సంవత్సరంలో జన్మించిన స్టీఫెన్ హాకింగు 50 సంవత్సరాల ప్రఖ్యాత బ్రిటీష్ శాస్త్రజ్ఞుడు. న్యూటన్ మహాశయుడు అధిష్టించిన కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయములోని ప్రతిష్టాకరమైన ''లుకేషియన్'' ఆచార్య పీఠానికి 1979 సంవత్సరంలో స్టీఫెన్ హకింగు వారసుడయ్యాడు. ప్రపంచంలో అత్యుత్తమ శాస్త్రవేత్తగా గుర్తించబడ్డ స్టీఫెన్ మాట్లాడలేడు, నడవలేడు, వ్రాయలేడు. కాని అతను 1988లో రచించిన గ్రంథం "Brief History of Time" 80 లక్షల కాపీలు అమ్ముడుపోయాయి. అతని సామర్థ్యానికి మానసిక వ్యవస్థ ఒక్కటే కృషి చేస్తోంది. మనలో కొందరి యొక్క భౌతిక వ్యవస్థ ఆరోగ్యంగా వున్నప్పటికి, మానసిక వ్యవస్థ సహకరించక పోవడం మూలంగా అంతర్గర్భితంగా వున్న శక్తి సామర్థ్యాలను సంపూర్ణంగా వినియోగించుకోలేక పోతున్నాం. స్టీఫెన్ హకింగ్ యొక్క మానసిక వ్యవస్థ పని చేసే విధానాన్ని పరిశీలిద్దాం.

స్టీఫెన్ హాకింగ్ ఎడమ చేతిలోని రెండువ్రేళ్ళు మాత్రమే అతని స్వాధీనంలో వున్నాయి. మిగిలిన శరీర అంగాలన్ని పక్షవాతం మూలంగా స్వాధీనం తప్పాయి. ముఖ కండరాల ద్వారా తన భావాలను అతికష్టం మీద వ్యక్తపర్చగలడు. ఎలక్ట్రానిక్ పరికరాల సాయంతో భావరహిత మయిన మాటలను వ్యక్తం చేయగలడు. ఇతరులు అతనిని ఎత్తి ప్రక్కమీద పడుకోబెట్టాలి. అతను కూర్చునే కుర్చీకి స్వయం శక్తితో నడిచే యంత్రాన్ని అమర్చారు. తన అధీనంలో వున్న ఎడమ చేతిలోని రెండువ్రేళ్ళసాయంతో తన కుర్చీని కారులాగా నడపగలుగు తున్నాడు. తాను చెప్పదలచిన మాటలను ఎడమ చేతివ్రేళ్ళతో కంప్యూటరుపై అతికష్టంగా టైపు చేసి ఆ మాటలను శబ్దాలుగా మార్చే పరికరం సాయంతో మాట్లాడగలుగుతున్నాడు. సుమారు నిముషానికి 15 మాటల వేగంతో మాట్లాడగలడు. సామాన్యంగా మనం నిముషానికి 120 నుంచి 130 మాటల వేగంతో సంభాషించగలం. మనం మాటలతో పాటు భావావేశాలను కూడ వ్యక్తపర్చగలం. ఈ సౌకర్యం స్టీఫెన్‌కు లేదు. అతను వాడే మాటలపరికరం అమెరికాలో తయారు చేశారు. అందువల్ల తన మాటలకు అమెరికన్ యాస వచ్చిందని చమత్కరిస్తుం టాడు. అతని మాటలు మరమనిషిమాటలలాగ వుంటాయి. అతను నోటితో మాట్లాడలేడు కాబట్టి అతని కుర్చీలో అమర్చబడ్డ కంప్యూటరులో తాను చెప్పదలచిన మాటలను పొందుపరుస్తాడు. ఆ మాటలను భౌతిక శబ్దాలుగా మార్చగల పరికరం మనకు అతని వుద్దేశ్యాలను మాటలుగా తెలియపరుస్తుంది. అందువల్ల మనకు వినిపించే మాటలు అతను చేసే శబ్దాలుకావు. అతను పళ్ళుతోముకోలేడు. అన్నం తనంత తాను తినలేడు. బట్టలు వేసుకోలేడు. అతనిని నిరంతరం కనిపెట్టుకుండటానికి నర్సుల బృందం సర్వసన్నద్ధంగా వుంటుంది. ఇన్ని ఇబ్బందులు వున్నా స్టీఫెన్ ప్రపంచ పర్యటన జరుపుతూ తన ప్రజ్ఞాపాటవా లను అందరికి పంచిపెడుతున్నాడు. శాస్త్రవేత్తల సదస్సులలో చర్చాగోష్టులలో పాల్గొనటమే గాకుండా, విందులలోను, వినోదాలలోను పాల్గొనడం విశేషం. డ్యాన్సు పార్టీలలో తనకుర్చీని లయబద్ధంగా నడిపిస్తూ తన భాగస్వామ్యాన్ని అందించి ఆనందించ గలుగుతున్నాడు. తన అశక్యతకు వీసమయినా కలత జెందక, సమస్యాపరిష్కార శక్తిని సంపూర్ణంగా వినియోగించుకో గలుగుతున్నాడు. మనకు ఎటువంటి అశక్యత లేకపోయినా మన నిరాశావాదం మన సమస్యాపరిష్కార శక్తిని క్షీణింపజేస్తోంది.

స్టీఫెన్ హాకింగుకు పుట్టుకతోనే అంగవైకల్యం ఏర్పడలేదు. 23వ సంవత్సరంలో నాడీ వ్యవస్థకు సంబంధించిన రోగ లక్షణాలు కన్పించాయి. ఈ వ్యాధికి నివారణ లేదని, సుమారు రెండు సంవత్సరాలలో చనిపోవచ్చునని వైద్య నిపుణులు నిర్ధారించారు. అయినప్పటికి మనోబలం వల్ల శరీరం సహకరించక పోయినా 27 సంవత్సరాలు జీవించగలిగాడు. ఇంకా, అనేక సంవత్సరాలు జీవిస్తాడని ఆశిద్దాం. నాడీ వ్యవస్థ క్రమక్రమంగా క్షీణిస్తూ 22 సంవత్సరాల నాడు అనగా 1970 లో అతని కదలికలను చక్రాల కుర్చీకి పరిమితం చేసింది. ఆనాటి నుండి ఇతరులు ఎత్తి ప్రక్కమీద పడుకోపెట్టటమో లేక ప్రక్కమీద నుండి కుర్చీలో కూర్చో పెట్టటమో చేయవలసి వస్తోంది. తన కుర్చీలో కూర్చుని విశ్వం యొక్క పుట్టుపూర్వోత్తరా లను ఆరాతీస్తున్నాడు. ఐన్‌స్టీన్ లాంటి మేధావులకు అంతు పట్టని అంశాలను విశ్లేషించి విశ్వమనుగడను గూర్చిన రహస్యాలను వెలికి తీస్తున్నాడు.

చిన్నతనం నుండి శాస్త్ర పరిశోధనలో అభిరుచివున్న స్టీఫెన్, తన తండ్రి వృత్తి అయిన వైద్యశాస్త్రంపట్ల మక్కువ చూపలేదు. గణిత శాస్త్రంలో ప్రావీణ్యతను సంపాదించి భౌతిక శాస్త్రంలో పరిశోధనలు చేస్తున్నాడు. తన లక్ష్యసాధనలో తన అంగవైకల్యం అడ్డుగోడగా వుండనీయని వ్యూహాన్ని చేపట్టి విజయాన్ని సాధించగలిగాడు.

ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడయి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో పరిశోధనకు ఉపక్రమించాడు. ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంలో ఫస్ట్‌క్లాస్‌రానివారికి మౌఖిక పరీక్ష జరిపి వారి ప్రావీణ్యతను నిర్ణయించే ఆనవాయితి వుంది. స్టీఫెను కూడ మౌఖిక పరీక్షకు హాజరవవలసి వచ్చింది. అప్పుడు నీ లక్ష్యమేమిటని అడిగితే ''నాకు ఫస్టుక్లాసు వస్తేగాని కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో సీటు దొరకదు. పర్యవసానంగా నేను ఇక్కడే చదవవలసి వుంటుంది. నన్ను ఈ విశ్వవిద్యాలయంలో నుంచి బయటకు పంపితేగాని మీకు తృప్తి వుండదు. అందువల్ల మీరు నాకు ఫస్టుక్లాసు ఇస్తారు. నేను కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో చేరుతాను'' అని తన విశ్లేషణాశక్తిని ఉపయోగించి సమాధానం చెప్పాడు. ఆ దశలో అతని ప్రజ్ఞాపాటవాలు అంతగా ఇతరుల దృష్టిని ఆకర్షించలేదు. త్వరలో చచ్చిపోతాను కాబట్టి చనిపోయేలోపల తన శక్తి సామర్థ్యాలను బహిర్గతం చేయాలనే తపన ఏర్పడిన పిదప దీక్షతో కృషిచేసి తన లక్ష్యాన్ని సాధించగలిగాడు. ఏ దశలోనయినా వ్యక్తి తన అంతర్గర్భితశక్తిని బయటకు తీసుకురావడానికి సావకాశం ఉందని స్టీఫెన్ నిరూపించాడు.

25 సంవత్సరాల వయస్సులో అతని నాడీమండలానికి వచ్చిన జబ్బు యొక్క ప్రభావం అతనిపై స్పష్టంగా కనిపిస్తున్నా అతని ఆత్మవిశ్వాసం ఆలోపాన్ని పరిగణనలోనికి తీసుకోనియ్యలేదు. ఆ దశలో జేన్ అనే యువతి ఇతని సమయస్ఫూర్తికి, హాస్యానికి ముగ్ధురాలయింది. ఆమె యొక్క ఆప్యాయతను, క్రమశిక్షణను స్టీఫెన్ హర్షించాడు. అతను ఎక్కువకాలం జీవించడని జేన్‌కు తెల్సినప్పటికీ, అతనికి అండగా వుండి అతని లక్ష్యసాధనకు తోడ్పడాలనే ధ్యేయంతో అతనిని వివాహమాడింది. ఇద్దరు సుఖసంతోషాలతో జీవితం గడిపి ముగ్గురు పిల్లలకు తల్లిదండ్రులయ్యారు. కాల క్రమేణా జబ్బు తీవ్రరూపం దాల్చి అతని శరీరాంగాలలో ఒక్కొక్కదానిని నిరూపయోగం చేస్తోంది. స్టీఫెన్ యొక్క మనో నిశ్చయం వల్ల ఎంతో ముందుగారావలసిన అశక్యత ఆలస్యంగా వస్తోంది. మనోదారుఢ్యం శారీరక రుగ్మతలను కొంతవరకు అదుపు చేయగలదనే సత్యాన్ని స్టీఫెన్ తన ప్రత్యక్ష నిదర్శన ద్వారా నిరూపించాడు.

స్టీఫెన్ హాకింగు తన అత్యధిక ప్రాచుర్యం గల పుస్తకానికి ముందుమాట వ్రాస్తూ 1987 లో తనకు పక్షవాతం మూలంగా కొంత ఇబ్బంది వున్నప్పటికి తాను అదృష్టవంతుడనని అభివర్ణించుకొన్నాడు. 1970 వ సంవత్సరంనుండి 17 సంవత్సరాలు ఇతరుల సహాయంతో కదలుతూ వున్న వ్యక్తి తాను అదృష్టవంతుడనని చెప్పుకోవడంలోనే ఉంది అతని విజయ రహస్యం. ఆయన తన భార్యా, పిల్లలు, సహఉపాధ్యాయులు తనకు సేవచేసే నర్సులు, తన వద్ద పాఠాలు చదువుకొనే విద్యార్థులు సమష్టిగా తన శారీరక బాధలను మరిపింప జేస్తున్నారని చెప్పాడు. ముఖ్యంగా విద్యార్థుల నుండి ఎదురయ్యే సవాళ్ళను సమర్థవంతంగా పరిష్కరించటానికి తాను చేసేకృషి తనకు సంతోషాన్ని, ఆనందాన్ని కలుగజేస్తున్నదని

చెప్పాడు. తన కృషివల్ల లభించే సంతృప్తి పక్షవాతం వల్ల ఎదురయ్యే కష్టనష్టాలను కనుమరుగు చేస్తున్నదంటాడు.

స్టీఫెన్ హోకింగు చాల మొండివాడు. అతని మొండితనం అనేక సంఘర్షణలను ఇంటిలోను, బయటా తెచ్చిపెట్టింది. అతని భావావేశాన్ని ముఖకండరాల కదలికల ద్వారాను, కంటి చూపు ద్వారాను తెలియపరుస్తాడు. ఒక్కొక్కప్పుడు తన కోపాన్ని వ్యక్తపర్చటానికి తన కుర్చీ చక్రాన్ని తనకు ద్వేషమున్న వ్యక్తికాలివేలు పైకి పోనిస్తాడు. కాని అటువంటి సన్నివేశాలు బహు కొద్ది మాత్రమే. అతడు స్నేహశీలి. స్నేహితులతో సరదాగా కాలం గడపాలని వాంఛిస్తాడు. ఇతరులు తనపట్ల సానుభూతిగాని, విచారంగాని వ్యక్తపరిస్తే సహించలేడు. తన అశక్యతను పరిగణనలోనికి తీసుకొని ఏదయినా మినహాయింపులు చేస్తే ఒప్పుకోడు. అందువల్లే అతని భార్యా పిల్లలు అతని పట్ల సహజంగా ప్రవర్తించటం నేర్చుకొన్నారు.

స్టీఫెన్ హోకింగుకు అతని వివాహం క్రొత్త ఆశయాలు కలుగ జేసింది. అప్పటినుండి తాను ఏదోసాధించాలని నిర్విరామ కృషి మొదలు పెట్టాడు. అతని కృషిలో జేను సహకరించి, కొండంత అండగా వుండి విజయసాధనకు తోడ్పడింది. అతని ఆత్మవిశ్వాసం శారీరక ఇబ్బందులను పరిగణనలోనికి తీసుకోకుండా చొరవతో ముందుకు సాగటానికి కారణభూత మైంది. అతని ఆత్మాభిమానం ఇతర్ల సానుభూతిని నిరాకరింప జేసింది. ఉదాహరణకు కేంబ్రిడ్జిలో అధ్యాపక బృందం, విద్యార్థులు, రోజు రెండు, మూడుసార్లు మధ్యాహ్నం భోజనాల దగ్గరో 'టీ' విరామంలోనో సమావేశమై అత్యంత కీలకమైన శాస్త్రవిషయాలను చర్చించుకొనే సంప్రదాయం వుంది. ఇట్టి సమావేశాలకు క్రమం తప్పకుండా స్టీఫెన్ హాజరై తనవంతు విషయ పరిజ్ఞానాన్ని ఇతరులకు అందిస్తూ వుంటాడు. ఇట్టి సమావేశాలకు రోజు హాజరవటానికి అతనికి ఇతరుల మాదిరిగా సాధ్యపడదు. అతని గదినుండి చాల దూరంలో వున్న సమావేశస్థలానికి రోజు రెండు మూడు సార్లు పయనించడం ఎంతో ఇబ్బందితో కూడుకొన్న కార్యక్రమం. అయినప్పటికి తన అశక్యతకు ఇతర్లు మినహాయింపు చూపించనవ సరం లేదనే భావంతో అనేక కష్టనష్టాలను అధిగమించి తన బాధ్యతను సక్రమంగా నిర్వహిస్తూ ఇతర్లకు మార్గదర్శకుడులా జీవిస్తున్నాడు. మనం స్టీఫెన్ నుండి స్ఫూర్తిని పొంది శారీరక బాధలను అధిగమించటానికి ప్రయత్నించాలి. స్టీఫెన్ హోకింగు ప్రపంచ విఖ్యాత శాస్త్రవేత్తగా గుర్తింపు పొందినప్పటికి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవీ బాధ్యతను సక్రమంగా నిర్వహిస్తున్నాడు. విద్యాప్రమాణాలు క్షీణిస్తున్న ఈ తరుణంలో స్టీఫెన్ హోకింగు మన ఉపాధ్యాయులకు ఆదర్శప్రాయంగా వుండగలడని ఆశిద్దాం. కొద్దిపాటి ప్రజ్ఞగల ఉపాధ్యా యులు అహంకారంతో విర్రవీగే ఈ రోజులలో స్టీఫెన్ హోకింగు లాంటి మహనీయుల స్ఫూర్తి చాల అవసరం.

స్టీఫెను చిన్నతనంలో నెమ్మదిగా పాఠాలు నేర్చుకొనేవాడని అతని సహచరులు చెప్పుతుం టారు. అతని దస్తూరిని గురించి తరచు ఉపాధ్యాయులు విమర్శిస్తూ వుండేవారట. ఎప్పుడూ గడియారాలనో, రేడియోలనో విప్పి మళ్ళీ బిగించలేక సతమతమౌతు వుండేవాడట. చిన్నతనం నుండి పెద్ద శాస్త్రవేత్త కావాలనే ఆకాంక్ష వుండేదట. అందువల్లే తండ్రి ఎంత ప్రోత్సహించినా వైద్యవృత్తిని చేపట్టలేదు. గణితశాస్త్రం అంటె ఎక్కువ ఉత్సాహం చూపించే

వాడు. అందువల్లే స్టీఫెను-గెలీలియో, న్యూటన్, ఐన్‌స్టైయిన్‌ల కోవకు చెందిన-ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు అవగలిగాడు. ఆ రోజులలో స్టీఫెనును ఎరిగిన వారెవరు ఇతను ప్రపంచ విఖ్యాత శాస్త్రజ్ఞుడవుతాడనుకోలేదు. నాడీ మండలం వ్యవస్థకు సంబంధించిన జబ్బు సోకినప్పటి నుండి అతని వైఖరిలో గణనీయమైన మార్పు కన్పించింది. ముఖ్యంగా కొద్ది సంవత్సరాలలో చనిపోతానని తెలుసుకొన్న తరువాత తన ప్రజ్ఞాపాటవాలను అభివృద్ధి చేసుకోవాలనే ఆకాంక్ష పెరిగింది. అప్పటి నుండి అతని జీవిత విధానంలో గణనీయమైన మార్పు కన్పించింది. ఒకవైపు శరీరకండరాలపై పట్టు తప్పుతూ వుండగా ఇంకొకవైపు మనస్సుపై ఆధిక్యతను పెంచుకోగలిగాడు. తన కెదురయ్యే సవాళ్ళను పరిష్కరించుకోవడానికి మనస్సును సమాయత్తం చేసుకొని ఆత్మవిశ్వాసాన్ని పెంచుకొన్నాడు. ఆత్మాభిమానంతో సానుభూతిని తిరస్కరించి స్వశక్తిపై ఆధారపడి జీవించటానికి అలవాటు పడ్డాడు. ప్రతి చిన్న అంశానికి సానుభూతిని పొంది ఇతరుల అండతో జీవించాలనుకొనేవారికి స్టీఫెన్ జీవితం మంచి గుణపాఠాన్ని నేర్పుతుంది. ఆరోగ్యం భౌతిక బాధలకు అతీతమైంది. ఎన్ని బాధలున్నా వాటిని మనస్సులోనికి చొప్పించకపోతే ఆనందంగా జీవించవచ్చు. జ్వరం వచ్చినా, జలుబు చేసినా తన అసౌకర్యాన్ని గూర్చి పట్టించుకోకుండా తనపనిలో నిమగ్నమవ్వగల ఏకాగ్రత స్టీఫెన్‌కు వుండటం మూలంగా అద్భుతమయిన పరిశోధనా ఫలితాలను సాధించగలిగాడు. స్టీఫెన్ మనసంతా శాస్త్రవిజ్ఞాన అంశాలతో నిండివుండటం మూలంగా తన అశక్తతను గూర్చిన ఆలోచనలకు తావు లేకపోయింది. తత్ఫలితంగా వాటికి ఆయన ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వలేదు. సామాన్యంగా మనం శారీరక అవసరాలకు ఎక్కువ ప్రాధాన్యం యిచ్చి వృత్తిపరమైన విషయాలకు తక్కువ ప్రాముఖ్యాన్నిస్తాము. అందువల్లే మన ఆలోచనలన్నీ స్వార్థచింతనతో వ్యవహరిస్తాయి.

తన అశక్యతను అధిగమించటానికి జ్ఞాపకశక్తిని క్రమక్రమంగా స్టీఫెన్ వృద్ధి చేసుకొన్నాడు. అతిక్లిష్టమైన లెక్కలను మనస్సులోనే చేయగలడు. దాదాపు 40 పేజీలు పట్టే లెక్కలను కూడ జ్ఞాపకశక్తిలో పదిలపర్చుకొని సరిచూచుకోగల స్థోమత అతనికి వుంది. కొన్ని రోజుల తరువాత కూడ తాను చెప్పిన అంశాలను తిరగదోడి వాటిలోని తప్పులను సరిదిద్దగలడు. అతడు ఏక సంతాగ్రాహి. విశ్వాన్ని గూర్చి పూర్తిగా తెలుసుకొనేంత వరకు తనకృషిని సాగిస్తానని ప్రతిజ్ఞ పూనాడు. స్టీఫెన్‌కు సహజ ఉపాధ్యాయ ప్రవృత్తి వుంది. సరసుడు, చమత్కారంగా సమాధానాలు చెప్పగలడు. సున్నిత హాస్యంతో అందరిని నవ్వించగలడు. ఉదాహరణలతో అతిక్లిష్టమయిన శాస్త్ర అంశాలను సామాన్యులకు కూడ అర్థమయ్యేటట్లు వివరించగలడు. అందువల్లే అందరి మన్ననలను అందుకోగలుగుతున్నాడు. ఉపాధ్యాయులు అతనిని అనుకరించటానికి ప్రయత్నించాలి. అతని అశక్యతను గూర్చి చమత్కరించుతూ తాను సహజంగా మాట్లాడగలిగినప్పటి కంటే, ఎలక్ట్రానిక్ పరికరాల సహాయంతో బాగా మాట్లాడగలుగుతున్నానని చెప్పుతూ వుంటాడు. అంటే తన జబ్బు తనకు మేలు చేసిందనే అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తాడు. ప్రతికూల పరిస్థితులను కూడ తనకు లాభం చేకూర్చే అవకాశాలుగా చూడగల మహనీయుడు అతడు. జబ్బుప్రథమ దశలో డాక్టర్లు కంగారు పడి అతడు ఎక్కువ కాలం జీవించడని అనుకొన్నారు కాని కొంత కాలానికి దాని ఉధృతం తగ్గి నెమ్మదిగా వ్యాపించటం మొదలు పెట్టింది. ఆదశలో స్టీఫెన్‌కు జీవించాలనే

ఆశ ఏర్పడింది. ప్రేమలో పడి వివాహం చేసుకోవాలనుకొన్నాడు. ఉద్యోగం వుంటేగాని కుటుంబాన్ని పోషించలేననుకొన్నాడు. ఉద్యోగం సంపాదించటానికి Ph.D పూర్తిచేయటానికి కృషి చేశాడు. అప్పటి నుండి అంచెల వారీగా ఎదుగుతూ వచ్చాడు. ఇప్పుడు ప్రపంచ విఖ్యాత శాస్త్రజ్ఞుడయ్యాడు. ఒక వైపు జబ్బు తన ప్రభావాన్ని చూపుతూ అతనిని అశక్యున్నిగా చేస్తూవుంటే ఇంకొకవైపు తన ప్రతిభను చాటుతూ పైపైకి ఎదిగి పోతున్నాడు. ఎన్ని అవరోధాలు వున్నా మనధ్యేయాన్ని సాధించుకోవచ్చునని స్టీఫెన్ నిరూపించాడు.

స్టీఫెన్ సంపాదన తన కుటుంబ ఖర్చులకు సరిపోకపోవటం మూలంగా అతని భార్యకూడ ఉద్యోగం చేయవలసివచ్చింది. ఇంతపెద్ద శాస్త్రవేత్తయినా, ఎన్ని భౌతిక ఇబ్బందులున్నా ప్రత్యేకమైన గది లేకుండా ఆయన మిగిలిన అధ్యాపకులతో పాటు స్టాఫ్‌రూమ్‌లోనే వుండి పని చేసేవాడు. 1979 లో ప్రతిష్ఠాకరమైన ''లుకేషియన్'' ఆచార్య పీఠం అధిష్టించిన పిదపే ఆయనకు ప్రత్యేకంగా ఒక గదిని క్రేంబిడ్జి విశ్వవిద్యాలయం వారు ఏర్పాటు చేశారు. అస్థాయికి ఎదిగినా ఓర్పుతో అందరి సహచరులతో స్టాఫ్ రూమ్‌లో తన పనిని ఏకాగ్రతతో చేసుకోగలిగేవాడు. ప్రత్యేక గదులుంటేనే గౌరవహోదాలకు నిదర్శనమనుకొనేవారు, ఇతని జీవితం నుండి ఎన్నో గుణపాఠాలను నేర్చుకోవాలి. మా ప్రతిభను గుర్తించటం లేదని సమాజాన్ని సంస్థలను నిందించేవారు స్టీఫెన్ హాకింగు ఓర్పును, నేర్పును సంతరించుకోవాలి. ప్రతిభాపాటవాలు ఎక్కడున్నా గుర్తింపు వెదుక్కొంటూ వస్తుంది. 1974 సంవత్సరంలో స్టీఫెన్‌కు 32 సంవత్సరాల వయస్సు వున్నప్పుడు అతనిని ఇంగ్లండులోని రాయల్ సొసైటి సభ్యునిగా ఎంపిక చేసుకొన్నారు. ప్రపంచంలో అత్యుత్తమ శాస్త్రపరిషత్తుగా పరిగణించబడే ఈ సంస్థలో ఆనాడు వున్న సభ్యులలో స్టీఫెన్ హాకింగు అతి చిన్నవాడు. ఈ గౌరవ పురస్కారాన్ని అందుకోవటానికి వెళ్ళినప్పుడు అతనిని చక్రాల కుర్చీనుండి చేతుల మీద ఎత్తుకొని పైకి తీసుకు వెళ్ళవలసి వచ్చింది. పదమూడు శతాబ్దాలుగా ఆ సంస్థకు క్రొత్తగా ఎంపికయిన సభ్యులు గౌరవపురస్కారాన్ని అందు కొనేటప్పుడు అధ్యక్షస్థానం వరకు నడిచి వెళ్ళి అక్కడవున్న పుస్తకంలో సంతకంపెట్టి అధ్యక్షునితో కరచాలనం చేసే ఆనవాయితీ వుంది. కాని స్టీఫెన్ హాకింగు భౌతిక పరిస్థితిని పరిగణనలోకి తీసుకొని అధ్యక్షుడే అతని వద్దకు వచ్చి సంతకం తీసుకొని కరచాలనం చేశాడు. స్టీఫెన్ హాకింగుపట్ల రాయల్ సొసైటి చూపిన ప్రత్యేకపు అభిమానం అతని గొప్పతనాన్ని చాటి చెప్పుతోంది. నోరు విప్పి మాట్లాడలేని, నడవలేని వ్యక్తికి ఇంగ్లండు దేశపు మహారాణి ఆదేశపు అత్యున్నతమైన బిరుదు (C.B.E) 1982 లో ఇచ్చి సత్కరించింది. అందువల్ల గుర్తింపులను వెంటాడుతూ తిరగటం కంటే సామర్థ్యాన్ని వృద్ధి చేసుకోవటంలో శక్తిని సద్వినియోగం చేసుకొంటే బిరుదులు, బహుమానాలు మనని వెదుక్కొంటూ వస్తాయని స్టీఫెన్ హాకింగు నిరూపించాడు. శాస్త్ర విజ్ఞానం అపారంగా పెరిగిపోతున్న ఈ రోజులలో శాస్త్రజ్ఞుల మధ్య పోటీ రోజు రోజుకు ఎక్కువవుతోంది. ఇంత పోటీని తట్టుకొని అంగవైకల్యాన్ని అధిగమించి అత్యుత్తమ శాస్త్రవేత్తగా గుర్తింపు పొందటానికి అతనికి నిర్విరామకృషి తోడ్పడింది. అట్టి కృషి చెయ్యకుండా తమని గూర్చి తాము గొప్పలు చెప్పుకొంటూ ఇతరుల అండదండలతో రాణించాలనుకొనే వారు తమలోపాలను గుర్తించగలగాలి. మనస్సును నిర్దిష్టలక్ష్యాల వైపు ప్రసరింపజేసి ఏకాగ్రత కలిగి అంకిత భావంతో కృషి చేస్తేతప్ప ప్రయోజనం వుండదు.

హాకింగు దంపతులు తమ రాబడి కుటుంబ ఖర్చులకే సరిపోవక పోవటం వల్ల పిల్లలను ప్రతిష్ఠాకరమైన విద్యాలయాలలో చదివించలేకపోయారు. వారిని ఇంటిదగ్గరలో వున్న బడిలో చదివించేవారు. పిల్లల చదువులకు సరిపడ్డ ఆదాయాన్ని సంపాదించటానికి స్టీఫెను పుస్తక రచన చేపట్టాడు. ఆ కార్యక్రమం కూడ అనారోగ్యం వల్ల మందకొడిగా సాగింది. స్వంతగా వ్రాయలేడు. ఇంకొకరికి చెప్పి వ్రాయించలేడు. ఇన్ని బాధలతో కష్టపడి (A BRIEF HISTORY OF TIME) అనేపుస్తకాన్ని పూర్తి చేస్తే ప్రచురణ కర్త అనేక సంశయాలతో ప్రచురించటానికి ముందుకు రాలేదు. అతికష్టం మీద కొన్నికాపీలు ముద్రించి అమ్మటానికి ప్రయత్నించారు. అనతి కాలంలోనే ఆపుస్తకం యొక్క విలువను తెలుసుకొన్న పాఠకలోకం 80 లక్షల కాపీలను కొని స్టీఫెన్ హాకింగుకు తగిన గుర్తింపును ప్రసాదించింది. ఈనాడు అతని జీవిత చరిత్రను గురించి వ్రాసిన పుస్తకాలు విపరీతంగా అమ్ముడు పోతున్నాయి. ఈ పరిణామం అంతా గత నాలుగయిదు ఏళ్ళలో జరిగింది. కొంతమంది హాకింగు - అనారోగ్యం తప్ప మిగిలిన అన్ని విషయాలలోను - అదృష్టవంతుడు అని అంటారు. ఆయన అదృష్టానికి ఆయన వైఖరే కారణం. వ్యతిరేక పరిస్థితులలో కూడ సవ్యంగా ఆలోచించగలిగే మానసిక వ్యవస్థను ఆయన రూపొందించుకొన్నాడు. ఇది ఆయన స్వయంకృషితో సాధించిన ఘనకార్యం. ప్రతి విషయాన్ని సాదరంతో స్వీకరించి, సవ్యంగా ఆలోచించి తగు నిర్ణయాలు చేయగల సామర్థ్యాన్ని అంచెలవారిగా స్టీఫెన్ వృద్ధి చేసుకొన్నాడు. అట్టి ప్రయత్నం ప్రతి ఒక్కరు చేయవచ్చు. అతనికి వున్న శారీరక అశక్తతలు మనలో చాలమందికి లేవు. అయినప్పటికి అపసవ్య ఆలోచనల్తో వ్యతిరేక ధోరణులలో వ్యవహరించటం మూలంగా మనలో వున్న శక్తిసామర్థ్యాలు వృథా అయిపోతున్నాయి. అట్టి అనర్థాన్ని నివారించగల శక్తి మనకున్నది. ఆ శక్తిని సద్వినియోగం చేసుకొనే బాధ్యతను మనకు మనమే చేపట్టాలి. ఇప్పటికైనా మన లోపాలను గుర్తించి మనశక్తి సామర్థ్యాలను సంపూర్ణంగాను సమగ్రంగాను ఉపయోగించుకొనే వ్యూహాలను రూపొందించి అమలు జరపటానికి కృషి చేస్తే ప్రయోజనం వుంటుంది, కాని చాలమంది అట్టి కృషి చేయలేక నిరాశా నిస్పృహలకులోనై సమాజాన్ని, సంస్థలను, కుటుంబ పరిస్థితులను నిందిస్తూ తమ శక్తిసామర్థ్యాలను వృథా చేసుకొంటున్నారు. ఇతరులను నిందించటంలో చాకచక్యాన్ని కలిగి వున్నవారు తమ లోపాలను గుర్తించ లేరు. తత్ఫలితంగా వాటి నివారణకు కృషి చేయలేరు. ఇతరుల కళ్ళతో మనను మనం చూడగలిగితే తప్ప మనలో ఉన్న లోపాలు మనకి కన్పించవు. అందువల్ల అభివృద్ధి పథంలో పయనించదల్చిన వారు ప్రప్రథమంగా తమలోపాలను గుర్తించి వాటి నివారణకు నిర్విరామ కృషి చెయ్యాలి. ఈ ప్రయత్నం ఎంతతొందరలో చేపట్టితే అంత ప్రయోజనం వుంటుంది.

**For further details please refer to following books:**


1. **Stephen Hawkings Universe,** By John Boslough
2. **A Brief History of Fime,** By Stepehn W Hakings
3. **Stephen Hawking: A Life Science,** By Micheal White and John Guibbin
4. **Stephen Hawking:** By Kitty Ferguson

# మృత్యుంజయుడైన కర్ణుని స్వగతం

(ప్రముఖ మరాఠీ రచయిత శ్రీ శివాజీ సావంత్ వ్రాసిన పౌరాణికనవలకు సమీక్ష)

''మృతులు కూడ లేచి మాట్లాడవల్సిన సమయం ఒకటి వస్తుంది. సజీవ వ్యక్తులు జీవన్మృతుల్లా వర్తిస్తున్నప్పుడు యిక మృతజీవులు మళ్ళీ ఊపిరి పోసుకువచ్చి దృఢంగా మాట్లాడకపోతే ఎలా? కనుక నేడు నేనూ కొంత గట్టిగా చెప్పాలనుకుంటున్నా''నంటూ మన గుండెలకి సూటిగా హత్తుకొనేలా ఎలుగెత్తుతూ తన స్వగతం ప్రారంభిస్తాడు శివాజీ సావంత్ సృష్టించిన దాన వీర శూర కర్ణుడు. సహజప్రతిభను కాలదొక్కుతూ కుల, వర్గ భూతాలు కరాళ నృత్యం చేసే, అత్యంత ఆత్మీయ సంబంధాలను సైతం సాంఘిక (దుర్) ఆచారాల పాలనకని తుంగలో తొక్కే సమకాలీన సమాజంపై సంధించిన వాడి అలుగులే ఈ కర్ణుని స్వగతాలు.

జీవితం ఒక దేవాలయమైతే మధురంగా మోగే గుడిగంటలు తన చంపానగరిని గుర్తుకు తెస్తాయి. తలపులు నెమలి ఈకలను బోలినవి, లేక వకుళ పుష్పాల వంటి వేమో; వాడి వెలిసినా నెత్తావి మాధురులు మిగిల్చిపోతాయి. తరులతాగుల్మాలతో, అశేష పశుపక్ష్యాది ప్రాణాలతో నిండిన చంపానగరి కర్ణుని ఈ నెత్తావి మాధురుల ఆద్యపుష్పం. అదేందుకంటే అది 'తనకుగా తనకు ఒక అర్థం కల్పించుకోవడానికే'నట! మరి అదే సావంతుని నవలలో సమ్మోహక రహస్యం. మన జీవితాల్ని మనకు అర్థవంతంగా మలుచుకోవాలనేదే మనందరి అంతరంగాల్లో పెల్లుబికే ప్రగాఢ వాంఛ గాదూ!?

కులవ్యవస్థపై తిరుగుబాటు చేసిన అసహాయశూరుడు ఈ కర్ణుడు. ''రాకుమారులైతే శతాధిక హస్తాలుంటాయేమిటి? మరి వారికి మాత్రం ఈ ప్రత్యేక ప్రాముఖ్యమెందుకు?'' అని ఆచార్యద్రోణుని సూటిగా ప్రశ్నించిన జంకు లేని శిష్యుడు కర్ణుడు.

కర్ణునికి అహంకారం మిన్న. తన నిమ్నతర సాంఘిగ హోదాతో, తన ఉన్నత ప్రతిభకు గుర్తింపు లేమితో రాజీపడలేక మథన పడిపోయే స్వాభిమానమే అది కాని దురహంకారమైతే కాదు. దెబ్బతిన్న అహం అనవచ్చు. సూర్యభగవానునినే ఆదిగురువుగా భావించుకుని సునిశితమైన ఆత్మక్రమశిక్షణతో శక్తియుక్తులు, దీక్షాదక్షతలు మిక్కుటంగా సంతరించుకుని అందరినీ మించజూచే, మించి పోయే తిరుగుబాటుదారుడీ సూతపుత్రుడు. ఇంతటి వీరబాలుడు ఎన్నెన్ని అవమానాల పాలయ్యాడో! సాహసంతో తను పట్టితెచ్చి యిచ్చిన చిరుతపులిని యజ్ఞపశువుగా పనికిరాదని ద్రోణాచార్యుడు తిరస్కరిస్తే ఎంతగా కుంగిపోతాడో? కాని ఈ న్యూనతా చేతన తనకు మాత్రమే ఎందుకో, రాకుమారులతో భుజంకలిపి తిరగాలని సూతకుల సంజాతులలో తాను మాత్రమే ఎందుకు తహతహలాడుతున్నాడో తనకే అర్థంకాక సతమతమవుతుంటాడు. ఏమైనా ప్రేమానురాగాలు పొందాలని, తగు గుర్తింపు పొందాలనే ఆరాటం అధికమే. కనుకే ''భళీ! నీవేరా అత్యుత్తమ విలుగానివి!'' అని అశ్వత్థామ

వెన్నుచరిస్తే ఆ మమతాభినందనకు అపారంగా పొంగిపోతాడు. రారాజు ప్రదర్శించిన స్నేహభావం, సానుభూతులకు హృదయమే అర్పించివేస్తాడు.

పేరోలగంలో రాధేయుడు, సూతపుత్రుడనని చెప్పుకోవడానికి కర్ణునికి ఈ ఆత్మన్యూనతా భావం, మహత్వకాంక్ష ఎలా అడ్డువస్తాయో! అయితే సావంతుని భీష్ముడు మాత్రం వేదవ్యాసుని శంతనపుత్రుని వలె కాదు. అర్జునుని మించిన దక్షత కర్ణునిదని నిష్కపటంగా ప్రకటిస్తాడు. కాని కర్ణుని కులంతక్కువ పట్ల భీముడు వెడనవ్వు నవ్వినప్పుడు మాత్రం ఈ గాంగేయుడెందుకో నోరు మెదపడు? ఖాండవవనాన్ని పాండవులకు ధారాదత్తం చేసినప్పుడు, నిండు సభలో ద్రౌపదీవస్త్రాపహరణం జరిగినప్పుడు కూడ భీష్మునికి ఈ మౌనమే శరణ్యమయింది! మరి కర్ణుడో తన ఆత్మగౌరవానికి దెబ్బ తగిలినప్పుడు మాత్రమే 'మతిమాలిన ముసలి మూర్ఖు'డని భీష్ముని దూషిస్తాడు. గంధర్వుల నెదిరింప జాలక పారిపోయిన కర్ణుడు అర్ధరథుడని పితామహుడు ఎద్దేవా చేయడం తట్టుకోలేక అలా నోరుపారేసుకున్న కర్ణుడు మనకు యిక్కడ మనవంటి మామూలు మనిషిలా అగుపిస్తాడు. అదే రచయిత కల్పనలోని చమత్కారం.

కర్ణుడే గాదు సావంతుని కుంతిసైతం అత్యద్భుత కల్పనే. వ్యాసభారతంలో లేని జిలుగు వెలుగులు సంతరించుకుని మనకిక్కడ కనిపిస్తుందీ కుంతి భోజుని గారాలపట్టి. ఆమె సదా పరులకోసమే జీవించింది. పృథగా పుట్టిన ఆ పాప కుంతిభోజుని యింట పూర్వనామాన్ని సైతం విసర్జించి పెరుగుతుంది. పాండురాజు భార్యఅయిన కుంతి చివరికి సవతి మాద్రికే భర్తని ఇహపరాల్లో అప్పజెప్పి తను మహారాణిగా, ఐదుగురు కొడుకుల్ని సాకి విద్యాబుద్ధులు గరపవల్సిన విధవగా నిలిచిపోతుంది. ఆమెది బేల జీవితం. కన్యగా తాగన్న కర్ణుని ఒక్కసారైనా తనివితీరా గుండెలకు హత్తుకుని పాలివ్వలేని అసహాయత. పొత్తిటిళ్లలోని బిడ్డను నదీజలాలలో ఎన్నడు వదిలిందో నాటినుండి మరెన్నడూ వాడు తన కొడుకేనని బాహాటంగా చెప్పుకొనలేక కుమిలిపోయిందా తల్లి.

ఆమెది పూర్తి ఏకాంత జీవితమే. తండ్రి దత్తతనిచ్చివేసిన ముద్దుబొమ్మగా, దూర్వాసుని చేతుల్లో ఆట బొమ్మగా, అనంతరం స్త్రీలోకంలోనే తనకు వైశిష్ట్యం సంతరించిపెట్టిన అపూర్వమంత్రాన్ని సైతం భర్త కోర్కెమేరకు మాద్రికి ఉపదేశించిన ముగుదగా కుంతిని గొప్పగా చిత్రిస్తాడు రచయిత. ఈ విషయంలో అచ్చగా తల్లిని పోలినాడు కర్ణుడు. తనూ యితరుల కోసమే జీవిస్తాడు. దుర్యోధనుని కోసం, వృషాలిని కోసం, తన పెంపుడు తలిదండ్రులకోసం, తనను దానమడుగ వచ్చే భిక్షకుల కోసం – పరుల కొరకే జీవించాడు అతడు.

కర్ణుని దేవునిగా పూజించే సతి వృషాలిని, అన్నను వీరపూజచేసే పెంపుడు తమ్ముడు శత్రుంతప - షోనుని శూన్యంలోంచి సృష్టించి వ్యాసునికి ప్రతిసృష్టి చేస్తాడు రచయిత. ఈ అనురాగ బంధాల నడుమసైతం కర్ణుడు ఎప్పుడూ ఒంటరిగాడే. తానెవరో తనకే తెలియక మథనపడుతూ, సదా తన స్థితిపట్ల అసంతృప్తితో కుమిలిపోతూ వుంటాడు. కాని తన సహజ ప్రతిభపై తనకున్న నమ్మకం చాలక సంఘం గుర్తింపుకోసమని తపన చెందడం విషాదకరమే. ఆ అన్వేషణా క్రమంలోనే అతడు చరిత్రయెరుగని మహాదాతగా మారిపోతాడు. ఆ దాతృత్వానికి సైతం చోదకశక్తి స్వాతిశయమే. సూర్యుని వదాన్యతతో పోల్చుకోవడం

సాంఘిక స్మృతిమందిరంలో తనకని ఒక మరపురాని గూడు సృష్టించు కొవడానికే. ఒక భార్యను సృష్టించడంతో సరిపెట్టుకోక కర్ణునికి రెండో పెళ్ళాన్ని - సుప్రియను - కూడ తెచ్చిపెడతాడీ రచయిత. అర్జునునికి దేనిలోనూ తీసిపోరాదనే భావనతోగాబోలు. పాంచాలికి వృషాలికి, సుభద్రకు సుప్రియకు శబ్దసామ్యం కూడ స్పష్టంగా వుంది గదూ. ఇక సావంతుని కర్ణునికి ఎనిమిది మంది కొడుకులు: తన వీరునికి కూతుళ్ల నెవరినీ సృష్టించలేదు నవలాకారుడు.

మాయాద్యూత సందర్భంలో కర్ణుని ఆత్మమననను అద్భుతంగా చిత్రించాడు సావంతుడు. సూర్య శిష్యునికి, సూతపుత్రునికి నడుమ అంతరంగంలో చెలరేగిన ఘర్షణను మన కళ్లకు కట్టాడు. తుదకు అంగరాజ్యకిరీటం తలమోపిన దుర్యోధనుని పట్ల కృతజ్ఞతా భరిత మిత్రభావం ముందు ద్రౌపదీ మానహరణం పట్ల తన ఆక్రోశం తలవంచక తప్పలేదు. అంతేకాదు ఆర్తయైన పాంచాలి తనను రక్షించమని పదుగురినీ పేరిత్తి వేడినా తనను నోరెత్తి పిలవకపోవడం అతగాడి అహాన్ని దెబ్బతీసింది. దానితో రెచ్చిపోయాడు. అది కులటన్నాడు. ''ఇంతదనుక పాండవ నపుంసకుల నడుమున వేలాడుతూవచ్చిన, వస్త్రాల ఒర లో దాగివున్న నల్లని కత్తిఅది. ఇప్పుడు దానిని ఒరనుండి తీసి దూయవలసిందే'' నంటూ అవాకులు పేలుతాడు కాని అంతలో అవమానితయైన పాంచాలితో తన వృషాలి తొంగి చూడడంతో సిగ్గుతోతలదించుకుంటాడు. అయ్యో, ఎంత నీచస్థాయికి కుంగి పోయానే, కంస శిశుపాలుర కోవకు చేరిపోయానేనని పరితపిస్తాడు.

కర్ణుడు తన సహజ కవచకుండలాలు ఒలిచి యిచ్చి వైకర్తనుడైన గతాన్ని ఒళ్లు జలదరించేలా వర్ణించాడు రచయిత. ఏ అపూర్వ శక్తియుక్తులు, వరదానాలు తనలో గాంచి దుర్యోధనుడు నిబ్బరంగొన్నాడో, పొంగి పోయాడో వాటి వనరునే స్వాతిశయంవల్ల కర్ణుడెలా వదులుకొన్నాడో యిక్కడ గుండెలకు హత్తుకొనేలా చిత్రించాడు. ఇంద్రుడిచ్చిన శక్తిని త్వరపడి ఘటోత్కచ సంహారానికి వాడిన కర్ణుడు ఆపై అర్జున సంహారానికి, తద్వారా దుర్యోధన విజయానికి అశక్తుడయిపోతాడు. 'పాండవులకు నీవే పెద్దన్నవై రాజ్యాన్ని, రమణిని కూడ ఏలుకోమన్న కృష్ణుని ఆహ్వానాన్ని దృఢంగా తోసిపుచ్చుతూ రానున్న సంగ్రామం రాధేయుని సంగ్రామమే కాగలదని, కనీవినీ ఎరుగని రీతిలో విజృంభించి మహోజ్వలంగా జ్వలించి బూడిదై తను చరిత్రలో అజరామరంగా నిలిచిపోగలనని గంభీరంగా ఉత్తరువిచ్చిన మహో ధీరుడతడు.

కర్ణునికి కృష్ణునికి నడుమ ఒక మార్మిక బంధాన్ని అతి లాఘవంగా చిత్రిస్తాడు రచయిత. ఉభయులూ క్షత్రియులేగాని నిమ్నకులస్థుల యింట పెరిగి పెద్దయినవారు. ఇరువురూ దివ్యజులే. తోబుట్టువులతో తలపడినవారే వారిద్దరూనూ. అంగరాజైనా సూతపుత్రునిగానే పేరు పొందినాడు కర్ణుడు. పోతే రణరంగంలో సారథిగా అయినాడు కృష్ణుడు. కాని కర్ణుడు కృష్ణునివలె కాదు. కలలోనైనా తన పెంపుడు తలిదండ్రులను మరిచి పోదామని, సూత కులాన్ని కాలదన్నుదామని భావించడు. పైగా రాధేయునిగానే మరణించ దలిచానని ప్రవచిస్తాడు. కృష్ణునిలోని లొసుగులు పదేపదే వేలెత్తి చూపడం రచయిత రూపొందించిన కర్ణుని ప్రత్యేకత.

తన బతుకంతా వెతలవెల్లువలో కొట్టుకుపోతుంటే చేయిసాచి రక్షించడానికి ఒక్కసారైనా ముందుకురాని కృష్ణుడు తగుదునమ్మా అంటూ యుద్ధానికి ముందు పనిగట్టుక వచ్చికలిసి 'కుంతీపుత్రుడవు నీవు సుమా' అని జన్మరహస్యం వెల్లడిచేసి మనసును ఎంతో కలతపెట్టి పోతాడు. అంతేగాక దుర్యోధనుని పక్షం విడిచి పాండవ పక్షపాతివి కమ్మని అతి నిర్లిప్తంగా కోరుతాడు! ఈ నేపథ్యంలో కడుపుమండిన కర్ణుడు కృష్ణుని సవాలు చేస్తూ విసిరిన కొన్ని ప్రశ్నలకు జవాబులు నేటికీ మన వద్ద లేవు.

అజేయమైన సుదర్శన చక్రంతో అలరారే కృష్ణుడు జరాసంధుని మాత్రం సంహరించ లేక పోతాడు ఎందుచేత? పైగా వానిచే పరాజితుడై మథుర విడిచి పారినాడు ఎందువలన? కర్ణునిచే ఓటమి నొందిన జరాసంధుడు కృష్ణుని ఓడించగలిగినాడే అది ఎట్లు? అసలు ఎవరీ కృష్ణుడు?

కుంతీ కర్ణుల మాతా పుత్ర సమాగమాన్ని అతి హృద్యంగా చిత్రించి ఇందులో గురుదేవులు రవీంద్రనాథ్ టాగూరు, మహారచయిత బుద్ధదేవ బోసుకు ఎంతమాత్రం తీసిపోనని నిరూపించుకున్నాడీ రచయిత శివాజీ సావంతుడు. లక్షలాది కురువంశజులంతా ఒక్కటై మహాసామ్రాజ్యాన్ని అవిభక్తంగా ఏలుకోవాలనే తన కోర్కె అని, అట్టి పక్షంలో పాండవ క్షేమం కోసం తాను ప్రాణాలర్పించి ఆ సామ్రాజ్యానికి పునాదిరాయి కావడానికి సంసిద్ధుడనేనని కర్ణుడు కుంతీమాతకు ఉద్వేగంతో చెప్పిన తీరు - ఆహా, అనితర సాధన రచనా నైపుణి అది. మన కళ్లు చెమర్చజేసే అతి సున్నిత ఘట్టం అది.

కర్ణుని చావును, అంత్యక్రియలను చిత్రించిన తీరు మన గుండెల్ని కలచివేస్తుంది. మహాదాత కర్ణుని కర్ణత్వానికి పరాకాష్ఠ - ఆఖరి శ్వాస విడిచే ముందు తన బంగారు పళ్లు విరిచి బ్రాహ్మణునికి దానం చేసిన ఆయన ఘన వదాన్యత - మనల్ని రోమాంచితం చేస్తుంది. దీనివల్ల కర్ణుడు నిజంగా మృత్యుంజయుడే అయ్యాడనిపిస్తుంది.

ఇంత గొప్ప నవలాత్మ కావ్యం లేక కావ్యాత్మక నవలను రచించినవాడు శ్రీ శివాజీ సామంతుడు; యిన్నేళ్లకు ఆయన మరాటీ మూలానికి చక్కటి ఆంగ్లానువాదాన్ని ప్రచురించిన రైటర్సు వర్కుషాపు వారు నిజంగా ఎంతో అభినందనీయులు! కొన్ని అంశాలతో కృష్ణ ద్వైపాయనుని సృష్టికి ప్రతిసృష్టి సైతం చేస్తూ కమనీయంగా సాగిపోయే ఈ అపూర్వ గ్రంథాన్ని మనమంతా తప్పక చదివి తీరాలి.

– రవీంద్రనాథ్ అలపాటి

చదవండి : మృత్యుంజయ – ది డెత్ కాంకరర్.
మరాటీ మూలం: శివాజీ సావంత్
ఆంగ్లానువాదం: పి. లాల్ & నందినీ నోపానీ; రైటర్సు వర్కుషాపు.
ధర రూ. 400/-

# యీనాటిదా రాజకీయాల్లో కాలుష్యం?

- డా॥ ఎన్. ఇన్నయ్య.

''నిజంగా పెదనందిపాడు ఉద్యమానికి వెన్నుపోటు పొడిచింది గాంధీజీయేమో అనే సందేహం కలుగుతుంది. కీర్తి కోసము, ప్రతిష్ఠకోసము ప్రజలలో ముమ్మరంగా సాగుతున్న ఉద్యమానికి ఒక్క ఉత్తరము ముక్కతో వెన్నుపోటు పొడిచారు శ్రీ గాంధీజీ''.

కాంగ్రెసు స్వాతంత్ర్యయోధుడు, ఖద్దరుధారి, జాతీయ భక్తుడు కీ.శే. పర్వతనేని వీరయ్యచౌదరి స్వయంగా రాసుకున్న మాటలవి. గాంధీజీ శిష్యుడైన వీరయ్య చౌదరి, జరిగిన సంఘటనలకు షాక్ తిని రాసిన సత్యాలవి. ఇవ్వాళ కాంగ్రెసువారు ఆయనకు విగ్రహాలువేసి పొగుడుతున్నారు. కాని చారిత్రక సత్యాలు వేరు.

పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం ఇంగ్లండ్ పార్లమెంటులో లార్డ్ వెల్లింగ్టన్ ప్రస్తావన చేశారు. అలాగే వీరయ్యచౌదరి పేరుకూడా బ్రిటిష్ పాలకుల్ని ఆనాడు హడల గొట్టింది. అటువంటి వ్యక్తి ఎందుకిలా రియాక్ట్ అయ్యాడు? పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం వీరయ్యచౌదరి సృష్టికాదు. జాతీయోద్యమంలో అదొకభాగం. గాంధీజీ భారత రాజకీయాల్లో ప్రవేశించిన తరువాత, తిలక్ గతించిన అనంతరం, తిరుగులేని నాయకుడుగా ఆవిర్భవించిన తొలి రోజులవి.

దేశంలో రాజకీయాల్ని కేవలం ఉన్నత వర్గాలకు పరిమితం చేయకుండా, ప్రజల్లోకి తెచ్చిన ఖ్యాతి గాంధీగారిదే. 1921 నవంబరు 4న ఢిల్లీలో జాతీయస్థాయి కాంగ్రెసు శాసనోల్లంఘనాన్ని చర్చించింది. ఆ తరువాత డిసెంబరులో అహమ్మదాబాద్‌లో కాంగ్రెసు పార్టీమహాసభలో పన్నుల నిరాకరణ జరపాలని తీర్మానించారు. దీనికి సూత్రధారి గాంధీయే.

ఆంధ్ర నుండి అహమ్మదాబాద్ వెళ్ళి కాంగ్రెసు సభలలో పాల్గొన్న కాంగ్రెసు ప్రతినిధులు అలాంటి పన్నుల నిరాకరణ తీర్మానాన్ని ఆహ్వానించి అమలుపరచడానికి అత్యుత్సాహంగా ముందుకు వచ్చారు. పర్వతనేని వీరయ్యచౌదరి అలా రంగప్రవేశం చేశారు.

పర్వతనేని వీరయ్య చౌదరి 1886లో పెదనందిపాడులో పుట్టారు. రైతుకుటుంబం. సాధారణ పాఠశాల విద్యాభ్యాసం చేసిన వీరయ్య చౌదరి రైతుగా కొనసాగుతూనే, మరోపక్క కర్నాటక సంగీతం సాధించారు. చుట్టుపట్ల గ్రామాలలో ఆయనపట్ల గౌరవం వుండేది. పట్టుదల, చిత్తశుద్ధిగల పెద్దమనిషి అని పేరు తెచ్చుకున్నారు. పన్నుల నిరాకరణోద్యమం నాటికి ఆయన వయస్సు 34 ఏళ్ళు.

ఎక్కడ పన్నుల నిరాకరణ జరపాలి? నూటికి 50 మంది ఖద్దరు ధరించాలి, పిల్లల్ని జాతీయ పాఠశాలకు పంపాలి, అస్పృశ్యతా దోషాన్ని నివారించాలి, మద్యపాన నిషేధం అమలు పరచాలి, దౌర్జన్య పద్ధతులు విడనాడాలి. అవసరమైతే న్యాయస్థానాలు, పాఠశాలలనుండి విరమించాలి. అందుకు ఎలాంటి ప్రజలు అవసరం? అనేది సూత్రప్రాయంగా కేంద్ర కాంగ్రెసు చర్చించి, మార్గదర్శక సూత్రాల్ని

రాష్ట్రాలకు వదలివేసింది. ఆ ప్రకారం ఆంధ్ర కాంగ్రెసు 1922 జనవరి 7న బెజవాడలో సమావేశమై, పెదనందిపాడు కూడా బాగా అనువయిందని ఎంపిక చేసింది. అప్పుడు వీరయ్య చౌదరిపై బాధ్యతప డింది. ఆయన ఉద్యమ నిర్వహణకు, కాంగ్రెసు గీటురాయితో ఉపక్రమించారు.

పన్నుల నిరాకరణోద్యమానికి ప్రథమంగా పన్నులు వసూలుచేసే అధికారులు తమ పదవులకు రాజీనామా చేయాలి. 1922 జనవరిలో పుసులూరులో పెదనందిపాడు ఫిర్కా గ్రామోద్యోగులు సమావేశమై మూకుమ్మడిగా తమ పదవులకు రాజీనామా లిచ్చారు. అంటే కరణాలు, మునబులు, గ్రామోద్యోగులు, వెట్టి మోతాదులు వైదొలగారు. బ్రిటిష్ పాలకులకు ప్రజలకూ మధ్యనయీ ఉద్యోగులే వారధి. వారు తొలిగితే శిస్తులు వసూలు కావు. శిస్తు వసూలు చేయాల్సిన సమయంలో యిలా రాజీనామా లేఖలు అందడంతో ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసే అవకాశం ప్రభుత్వానికి లేదు. కొందరిని తాత్కాలి కంగా నియమించినా, వారికి రికార్డు విషయం తలా తోకా తెలియదు గనుక, ఏమీ వసూళ్ళు చేయలేక పోయారు. ప్రభుత్వం తన పెత్తనాన్ని చూపడానికి, ప్రజల్ని బెదిరించడానికి సైన్యాల్ని పంపింది. అయినా పనిజరగ లేదు.

వీరయ్య చౌదరి నాయకత్వాన ప్రారంభమైన ఉద్యమాన్ని జిల్లా కాంగ్రెసు బలపరచింది. పొన్నూ రులో సమావేశమై ఒక తీర్మానం కూడా చేశారు.

పెదనందిపాడులో పన్నుల నిరాకరణ సఫలప్రదమైతే, ఆ ప్రభావం ఇతర ప్రాంతాలకు ప్రాకుతుందని అధికారులు నివేదికలు పంపారు. మద్రాసు శాసనసభ చర్చించి, అర్జంటుగా రికవరీ శాసనం చేసింది. జస్టిస్ పార్టీ ఆనాడు పాలనలో వుండగా, బ్రిటిష్‌వారు దమన నీతికి పూనుకున్నారు.

వీరయ్య చౌదరి ఉద్యమసారథిగా శాంతిసేన ఏర్పరచారు. ఖద్దరు ధరించిన యీ సేన ఆయాగ్రామాల నుండి స్వచ్ఛందంగా బయలుదేరి సమాచారాన్ని అందించేవారు. ప్రజలకు నచ్చచెప్పి, ధైర్యం పురికొల్పేవారు. సైన్యానికి ఎవరూ సహకరించకుండా చూచేవారు. సైన్యం ఏంచేసినా, శాంతిసేన అహింసనే పాటించింది. గ్రామాల మధ్య వార్తల్ని చేరవేయడం, బ్రిటిష్‌వారి రాకపోకల్ని నాయకులకు చెప్పడం, రాత్రిళ్ళు కాపలా వీరి దినచర్యగా వుండేది. శాంతిసేన విషయంకూడా ఇతర ప్రాంతాలకు తెలియగా, పెదనందిపాడు ఒక స్వాతంత్ర్య యాత్రాస్థలంగా, వీరయ్య చౌదరి ఆదర్శనీయుడుగా ప్రజల్ని ఆకర్షించారు. బ్రిటిష్‌వారు ఉద్యమాన్ని దెబ్బకొట్టడానికి ఎన్నో ఎత్తుగడలు ప్రయోగించారు. రూథర్‌ఫర్డ్‌ను జిల్లా కలెక్టరుగా నియమించి, ఆయనకు తోడుగా వుండే నిమిత్తం సహకార శాఖలో సూపర్ వైజర్‌గా వుంటున్న ఒక వ్యక్తిని, అర్జంటుగా డెప్యూటీ కలెక్టర్ని చేసి పంపారు. అతడు కమ్మ కులస్తుడుగావడం వలన, వీరయ్య చౌదరిపై ప్రయోగించారు. కాని ఆ వ్యూహం బెడిసి కొట్టింది. కమ్మ రైతులెవరూ లొంగిరాలేదు. జస్టిస్ పార్టీకి చెందిన కమ్మవారు సైతం ఆ ప్రాంతంలో వీరయ్యచౌదరికే మద్దతు యిచ్చారు. సైన్యం ఏమడిగినా, రూథర్‌ఫర్డ్ వంటివారు ఏమి తెలుసుకోవాలన్నా ఎవరూ గ్రామాలలో నోరు మెదిపేవారుకారు.

మొత్తం 14 లక్షల 73 వేల రూపాయలు శిస్తు వసూలు కావలసివుండగా, వీరయ్య చౌదరి అమలు పరచిన విధానాలవలన 5 శాతం కూడా శిస్తులు వసూలు కాలేదు. పెదనందిపాడు ఫిర్కాలో 20 గ్రామాలు, చుట్టుపట్ల 30 గ్రామాలకు యిది ప్రాకింది. దారీ డొంకా లేని వూళ్ళలో నోటి మాట ద్వారా వీరయ్య చౌదరి సందేశం అలా అందుకున్నారు రైతులు.

ఆనాడు ఓటర్లు పరిమితంగా వుండేవారు. పన్ను చెల్లించేవారికే ఓటు హక్కు వుండేది. కొద్దిమందే

పన్నులు చెల్లించే స్థితిలో వుండేవారు. అంత మాత్రానికే యింత హడలిపోయిన ప్రభుత్వం రానురాను సైన్యాన్ని పెంచింది. గ్రామాలలో ప్రజల్ని భీతావహుల్ని చేసింది. ఇళ్ళల్లో జొరబడి తినుబండారాలు ఎత్తు కెళ్ళడం, స్త్రీలను ఇబ్బంది పెట్టడం కూడా జరగకపోలేదు.

ఉద్యమాన్ని గురించి ఇతరప్రాంత ప్రజలు, కథలు గాథలు చెప్పుకొంటుండగా, జిల్లాలో కాంగ్రెసు ప్రముఖులుగా వుంటున్న నడింపల్లి నరసింహారావు, గొల్లపూడి సీతారామశాస్త్రి (ఉత్తరోత్తరా స్వామీ సీతారాం) ఆ ప్రాంతం స్వయంగా పర్యటించారు.

## పట్టాభి నాటకం:

రాష్ట్రస్థాయి నాయకుడు పట్టాభి సీతారామయ్య ఆధ్వర్యాన ఎంపిక చేసిన ప్రాంతాలలో గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని ఆయా ఫిర్కాలున్నవి. మిగిలిన చోట్ల, ఉద్యమాల్లో వూపు లేదు. పట్టాభి నాయకత్వం విఫలమైంది. గుంటూరు జిల్లాకు కొండా వెంకటప్పయ్య ఆనాడు ప్రముఖ కాంగ్రెసు నాయకుడు. వీరయ్య చౌదరి ఆయనకు మద్దతుదారు. గుంటూరు జిల్లాలోని పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం సఫలమైతే వీరయ్య చౌదరి, కొండా వెంకటప్పయ్యలకు పేరు వస్తుంది. ముఠా రాజకీయాలలో ఆరితేరిన పట్టాభికి యిది ఇష్టంలేదు. కాని ఉద్యమాన్ని అనుమతించింది తానే. కొండా వెంకటప్పయ్యను పట్టాభి వ్యతిరేకించేవాడు. పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమంలో తలమునకలై ముమ్మరంగా ప్రజల్లో రాత్రింబగళ్ళు పనిచేస్తున్న వీరయ్య చౌదరికి యీ కాంగ్రెసు కాలుష్యం తెలియదు. కాంగ్రెసు అంటే జాతీయోద్యమమే అని అమాయకంగా నమ్మి పనిచేశాడు. అందుకే బిత్తరపోయాడు! పట్టాభి సీతారామయ్య తన పంతం సాధించడానికి, ఉద్యమం సాగుతుండగా, గాంధీగారి దగ్గరకు వెళ్ళాడు. ఉద్యమాన్ని గురించి చిలవలు పలవలుగా అల్లి వ్యతిరేక ధోరణిలో చెప్పివుంటాడు. గాంధీ అంతకుముందే పెదనందిపాడు ఉద్యమ ప్రభావం గురించి తెలుసుకున్నారు. బ్రిటిష్ పాలకులకు ఉత్తరం రాశారు. ఉద్యమం సాగేచోటకు అవసరమైతే తాను వెడతానని గవర్నర్ జనరల్‌ను హెచ్చరించారు. అలాంటి గాంధీజీ, కేవలం పట్టాభిమాట విని, ఉద్యమం ఆపండని ఎలా సందేశం యిచ్చారు? ఉద్యమానికి కావలసిన హంగులు పెదనందిపాడులో లేవని, సగంమంది ప్రజలు అస్పృశ్యత పాటిస్తున్నారని, ఇలాంటి కారణాలేవో గాంధీజీ పేర్కొన్నారు. గాంధీజీ సందేశం అందుకున్న ఆంధ్ర కాంగ్రెసు నాయకులు ఆశ్చర్యపోయినా, బయటపడకుండా తగిన చర్యలు తీసుకున్నారు.

కొండా వెంకటప్పయ్యగారు తక్షణమే కొందరు కాంగ్రెసు వారిని పెదనందిపాడు ప్రాంతానికి పంపారు. వారంతా చూచివచ్చి, జరిగింది నివేదించారు. దాని ఆధారంగా కొండా వెంకటప్పయ్య ఒక జాబు వ్రాసి, నడింపల్లి నరసింహారావు ద్వారా గాంధీజీకి పంపారు. అంతకుముందే ఒక టెలిగ్రాం కూడా యిచ్చారు. సారాంశం ఏమంటే: పెదనందిపాడులో వీరయ్య చౌదరి ఆధ్వర్యాన జరిగే ఉద్యమం కాంగ్రెసు తీర్మానం ప్రకారం సజావుగా సాగుతున్నదనీ, ఉద్యమం చాలా ముందంజ వేసిందనీ అది ఆపేస్తే, కాంగ్రెసు నుండి ఆంధ్రను తొలగించడమే అవుతుందనీ అన్నారు. పోలిసెట్టి హనుమయ్య, నడింపల్లి నరసింహారావులు కూడా సంతకాలు చేశారు తంతిపై (1922 జనవరి 17).

గాంధీజీ సమాధానం యిస్తూ స్థానిక పరిస్థితులు మీకే బాగా తెలుసుకాబట్టి, మీదే బాధ్యత అన్నాడు. అంతవరకు బాగానే వున్నది.

ఆ తరువాత ఏం జరిగింది? గాంధీజీ అంతటివ్యక్తి ఉద్యమాన్ని ఆపమంటున్నందున, కాంగ్రెసు పక్షాన ఒక ఉపసంఘాన్ని వేసి, విషయం పరిశీలించమన్నారు. టంగుటూరి ప్రకాశం, కాశీనాథుని నాగేశ్వరరావు, దండు నారాయణ రాజులు ఆ ఉపసంఘంలో సభ్యులుగా పెదనందిపాడు పర్యటించివచ్చారు. ఉపసంఘంవారు ఒకవైపున ఉద్యమాన్ని పొగిడి, ప్రజల్ని మెచ్చుకొని, కాంగ్రెసు షరతులన్నీ ప్రజలుచక్కగా పాటించి ఉద్యమం దీక్షగా జరుపుతున్నారన్నారు. అయినా గాంధీగారి అభిప్రాయం మరోపక్క వారిని పీడిస్తుండగా, ప్రజలపై సైన్యం దౌర్జన్యం జరిపితే తట్టుకోలేరేమో! కనుక ఆపేస్తే పోతుందని సలహాయిచ్చారు.

## ప్రకాశం ఏం చేశాడు?

ఈ విషయమై పట్టాభి ప్రత్యర్థిగా పేరొందిన టంగుటూరి ప్రకాశం ''నా జీవిత యాత్ర'' లో యిలా వ్రాశారు.

''క్లిష్ట సమయంలో గుంటూరులో ప్రారంభించబడిన యీ పన్నుల నిరాకరణ ఉద్యమం గాంధీగారి అభిప్రాయానికి భిన్నంగా ఆరంభింపబడ్డది అంటూ డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారిచే వ్రాయబడిన ఉత్తరం ఒకటి ''జన్మభూమి'' పత్రిక ప్రచురించింది. దరిమిలా 'సర్' కూడా అయిన థామస్ రూథర్‌ఫర్డ్ యీ 'జన్మభూమి' ప్రతులను విరివిగా కొని, జిల్లా కేంద్రస్థానాలలో పెక్కుచోట్ల తానే స్వయంగా ఆ కాపీలను పంచిపెట్టడం ఆరంభించాడు.

ప్రకాశం యింకా రాస్తూ: ''ఉద్యమం వందగ్రామాలలోనే ప్రారంభించబడ్డా జిల్లా మొత్తం సానుభూతితో పెద్ద యెత్తున హర్తాల్ ఆరంభం అయింది. నాలుగు మాసాలు దాటినా నాలుగు పైసలయినా పన్నుల రూపంగా వసూలు కాలేదు.'' ప్రకాశంగారు పెదనందిపాడు ఉద్యమాన్ని ఆకాశానికెత్తి మాట్లాడుతూనే, వీరయ్య చౌదరి పేరు ప్రస్తావించలేదు.

ఉద్యమం విరమించమని ఉపసంఘం సిఫారసు చేసింది. ఈ నివేదిక పర్యవసానం చర్చించి నిర్ణయం తీసుకోడానికి కొండా వెంకటప్పయ్య ఇంట్లో గుంటూరులో జిల్లా కాంగ్రెసు సంఘం సమావేశమైంది. అప్పుడు చర్చల సందర్భంగా పట్టాభి సీతారామయ్య బయటబడి, ''పెదనందిపాడు అన్ని విధాల తయారవనిదే ఎట్లాపన్నుల నిరాకరణకు అనుమతించారని?'' ప్రశ్నించారు. కొండా వెంకటప్పయ్య యీ ప్రశ్నకు సమాధానాన్ని వీరయ్య చౌదరి చెప్పాలన్నారు. ''అయ్యా పట్టాభిగారూ! తమరు ఏలూరులో పన్నుల నిరాకరణోద్యమంకు అనుమతించినారుగదా. ఏ విధముగా ఉద్యమానికి అనుకూలంగా ఉన్నదని మీరు ఏలూరులో అనుమతించినారు?'' అని వీరయ్య చౌదరి అడిగారు. పట్టాభికి నోట మాట రాలేదు. పట్టాభి సీతారామయ్య శీలాన్ని కొండా వెంకటప్పయ్య శంకించారు.

## గాంధీ యిలా ఎందుకు చేశారు?

ఉపసంఘ సిఫారసుల మేరకు పన్నుల నిరాకరణోద్యమం ఆపాలా? వద్దా? అని చర్చిస్తుండగా, నాటకీయంగా గాంధీ వద్దనుండి వచ్చిన ఒక చీటీని సమావేశంలో బయట పెట్టారు. పట్టాభి సీతారామయ్యగారే స్వయంగా గాంధీ నుండి ఆ చీటీ తెచ్చినా, మరెవరి ద్వారానో సమావేశానికి పంపారు. స్థానిక పరిస్థితులు మీకే తెలును, మీ నిర్ణయానికే వదిలేస్తున్నాను అన్న గాంధీజీ, ఉద్యమం

విరమించమని ఎందుకురాశారు? పట్టాభి వలలో ఎందుకు చిక్కారు? అంటే ఎవరి కారణాలు వారికున్నాయి. రాష్ట్రస్థాయిలో పట్టాభిది పై చేయికాగా, దేశస్థాయిలో గాంధీ కారణాలు వేరు.

**ఆంధ్ర కాంగ్రెసు పట్ల గాంధీజీ ఎన్నడూ సుముఖులు కాదు. తిలక్ మద్దతు వలన ఆంధ్ర కాంగ్రెసు ఏర్పడింది.** తమిళనాడుకు అనుకూలంగా, ముఖ్యంగా తన రాజాజీకి మద్దతుగా గాంధీజీ ఆంధ్రను వ్యతిరేకిస్తుండేవారు. ఆంధ్రలోని పెదనందిపాడులో వీరయ్య చౌదరి ఆధ్వర్యాన పన్నుల నిరాకరణోద్యమానికి పేరువస్తే? తాను బార్డోలీలో ఉద్యమం జరిపిన తరువాత, ఫలితాలు చూచి తరువాత మిగిలినవారు అనుసరించాలన్నారు. తాను చెప్పినట్లు వింటే ఏడాదిలో స్వరాజ్యం వస్తుందన్నారు 1922 లో! తరువాత, తన అంచనా తప్పు అనీ, హిమాలయాలంత తప్పు చేశానని క్షమాపణ చేప్పారు బహిరంగంగా!

పర్వతనేని వీరయ్య చౌదరి బాధతో బయటపడ్డారు. తన డైరీలో వ్రాసుకుంటూ: ''భారత స్వాతంత్ర్య సమర మహాసేనానిగా పరిగణింపబడుతున్న మహాత్మాగాంధీజీ పంపిన లేఖార్థాలు చకితుల్ని చేసేటటువంటివి, గాంధీజీ యీ విధంగా వ్రాశారా? అనే సంశయం కలుగుతుంది''. అని వాపోయారు. గాంధీజీ వెన్నుపోటును కాల వైపరీత్యంగా సరిపెట్టుకున్నారు వీరయ్య చౌదరి. సంగీతం వైపు తన మనస్సును లగ్నం చేసుకున్నారు.

ఉద్యమం విరమిస్తున్నట్లు కాంగ్రెసు తీర్మానించగానే ప్రభుత్వం ఇంకా దౌర్జన్యం చేసింది. రైతులు నీరుగారిపోయారు. కలెక్టరు రూథర్‌ఫర్డ్ వెంటనే వీరయ్య చౌదరిని నిర్బంధించి, గుంటూరులో తుపాకి చూపి, క్షమాపణ చెప్పడమో, చావో తేల్చుకోమన్నాడు. ఆ పరిస్థితులలో తలవంచాడు వీరయ్య చౌదరి జామీనుపై విడుదల కావడాన్ని గురించి, మాదాల వీరభద్రరావు యిలా రాశారు. ''అలా క్షమాపణ చెప్పి జామీనుపై విడుదల గావడంపట్ల కొండా వెంకటప్పయ్య అసంతృప్తి చెందాడు'' (దేశభక్త జీవిత చరిత్ర చూడండి).

వీరయ్య చౌదరి స్వాతంత్ర్యోద్యమంలోనూ, స్వతంత్ర భారతంలోనూ కాంగ్రెసు వారి చిద్విలాసాలు కళ్ళారా చూచి శేష జీవితం ఆంధ్రయూనివర్శిటీ, సంగీత నాటక అకాడమీలలో కర్నాటక సంగీతంలో తన కృషి సాగించి తృప్తి చెంది 1960 లో చనిపోయారు. విగ్రహాలలోకాదు చరిత్రలో నిలుస్తారు.

---

## కొన్ని ఆధారాలు:


M.K.Gandhi: Young India 23 Feb 1921, 8 Sep 1920, 22 Sep 1921

2. M.Venkatarangaiah: The Freedom Struggle in Andhra Pradesh (Andhra), Vol III 1921-31

3. పర్వతనేని వీరయ్య చౌదరి డైరీ: గుంటూరు మండల సర్వస్వం 1964
4. కొడాలి ఆంజనేయులు (సం): ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ
5. కొండా వెంకటప్పయ్య: స్వీయ చరిత్ర
6. టంగుటూరి ప్రకాశం: నా జీవితయాత్ర
7. మాధల వీరభద్రరావు: దేశభక్త జీవితచరిత్ర.

# కరుణ రసము

- చీమకుర్తి శేషగిరిరావు

## రస వివేచన :

రసముల నిష్పత్తిని గురించి తొలుతగా పేర్కొనినది భరతుని నాట్య శాస్త్రమే అయినను, తరువాతి కాలమున ఆయా రసములలోని ప్రముఖత మొదలగు వానిని గురించి అనేక వాదములు రూపొందినవి. అందునను కరుణరస విషయమున భరతుని అభిప్రాయమునే కొందరు కాదన గలిగిరి.

భరతుని అభిప్రాయమున కరుణరసము ప్రకృతిరసము కాదు; శృంగార, రౌద్ర, వీర, బీభత్సములు మాత్రమే ప్రకృతి రసములు అనగా మౌలికములైన రసములు. వానిలోని రౌద్రము నుండి కరుణ ఉత్పన్నము అయ్యెనని భరతుడు తెలియజేసెను. కాని కాలక్రమమున ఈ వాదము వివాదగ్రస్తమైనది. ప్రకృతి రసములు నాలుగనుట సమంజసము కాదనియు, రసమువలన కలుగు ఆనందము అఖండమగుటచే ప్రకృతి రసము ఒకటియే ఉండుననియు కొందరు వాదించిరి. ఆ ఒక ప్రకృతిరసము ఏది అనుటలో కూడ అభిప్రాయ భేదములు చెలరేగినవి. కరుణరసమే ఆ ప్రకృతిరసమని, క్రీ.శ. 8వ శతాబ్దివాడగు, భవభూతి మహాకవి తాను రచించిన ఉత్తరరామ చరితలో ఇటుల స్పష్టీకరించెను:

ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదాత్
భిన్నః పృథక్ పృథగివాశ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుద తరంగ మయాన్వికారా
నంభో యథా సలిలమేవ హితత్సమస్తమ్

- ఉత్తరరామ చరిత - తృతీయాంకము

(తా. కరుణము ఒకటియే ప్రకృతి రసము. నీరు ఏవిధముగ తన ప్రవాహ గతిలో బుడగలుగ, సుడులుగ, అలలుగ రూపవికృతులను ప్రదర్శించుచున్నదో ఆ తీరుగనే కరుణము ఆయా నిమిత్త భేదాలవలన శృంగారాదులగు తక్కిన రసములుగ పరిణమించు చున్నది).

భవభూతి వాదమును ఆ తరువాతి వారెవరును అంతగ ఆదరించినటుల కన్పడదు. క్రీ.శ. 10వ శతాబ్దివాడగు అభినవగుప్తుడు భరతుని వాదమునే సమర్థించి, శృంగారమునకు రసరాజత్వమును అంటగట్టి, కరుణమును ఉత్పన్న రసముగనే భావించెను.

ఇక భరత, భవభూతుల అభిప్రాయములలో ఏది సత్యమను విషయమున ఆలంకారికులు ఎవ్వరును సమగ్ర చర్చ జరిపినటుల కన్పడదు. వేర్వేరు దృక్కోణముల నుండి జరిపిన పరిశీలనల వలన ఈ మతభేదము ఏర్పడినటుల చెప్పవచ్చును. ఆ దృక్కోణములను, ఈ క్రింది విధముగ తెలుప వీలగును.

లోకమున పీడనము ఉన్నపుడే కరుణకు స్థానము ఏర్పడగలదు. ఆ పీడనము రోగమువలన కావచ్చును, లేదా ఈతి బాధల వలన కావచ్చును; లేదా బలవంతుని దౌష్ట్యము వలన కావచ్చును. ఇట్టివన్నియు పౌరాణికుల దృష్టిలో రుద్రశక్తులే. రుద్రశక్తియే రౌద్రము. అందువలన రౌద్రము విజృంభించి మానవుని పీడనమునకు లోజేసినపుడు ఆ పీడితుని యెడల సహృదయునికి కరుణ కలిగి హృదయము ద్రవించును కావున రౌద్రమునుండి కరుణము ఉత్పన్నము అయ్యెనని భరతుడు భావించెను.

ఇక కావ్య, నాటక ప్రపంచమునేగాక జగన్నాటకమును కూడ దర్శించుటకు కృషిచేసిన భవభూతికి కరుణమునకు అందుగల స్థానము వేరువేరుగ కన్పట్టినది. జగత్తు రూపొందుటలో శృంగారమునకు ప్రముఖ స్థానము ఉన్నను, ఆ జగత్తు సుఖశాంతులతో మనుగడను సాగించి వర్తించుటకు 'కరుణము' ముఖ్యమను సత్యము అతనికి దృగ్గోచరమైనది. లోకమున సృష్టియంతయు ఒక తీరుగ ఉండదు. బలవత్తర జీవులతోపాటు బలహీనులును ఉండుట ఒక నగ్న సత్యము. అట్టియెడ బలవత్తరులు బలహీనుల యెడ కారుణ్యముతో వర్తించని యెడల సర్వనాశనమే జగత్తునకు సంభవించును. అపుడు శృంగారాదులకు స్థానమే ఉండదు. కావున కరుణమే ప్రకృతి రసము అని భవభూతి అభిప్రాయము.

ఇక, కరుణరసమే నిమిత్తభేదముల వలన శృంగారాది రసములుగ పరిణమించెననుటను కూడ సమర్థింప వీలున్నది. శృంగారమునకు విపర్యయము కరుణరసమని అభినవగుప్తుని అభిప్రాయము; దీనినే వేరుతీరుగ కరుణరసమునకు విపర్యయమే శృంగారము అనికూడ చెప్పవచ్చును. అపుడు కరుణమే రసరాజత్వమును పొంద వీలగును.

ఇటులనే కాదు; పరిపూర్ణమానవుని గురించి భారతీయ మతములందుగల సామాన్యాభిప్రాయమును గమనించినను, కరుణరసమే ఒక ప్రత్యేక ప్రాముఖ్యము కలిగి యున్నటుల స్పష్టమగును. ఉత్తమ మానవుని లక్షణములుగ మైత్రీ, కారుణ్య, ముదిత, ఉపేక్షలు భారతీయ మతములన్నింటను పరిగణింపబడినవి. వీనిలోని కారుణ్యమే తక్కిన మూడింటికి మూలకందము.

ఇటుల ధార్మిక దృష్టిలో సైతము అత్యంతాదరణను ఆర్జించిన 'కరుణరసము'నకు అంగిరసముగ, సంస్కృత సాహిత్యమునగాని, దానినే అనుసరించిన దేశభాషా సాహిత్యములందుగాని స్థానము లభించినది కాదు. ఇందులకు కారణము సుస్పష్టము. ఇదివరలో శృంగార రస చర్చలో చెప్పబడినటుల క్రీ.పూ. రెండవ శతాబ్ది తరువాత రూపొందిన సంస్కృత సాహిత్యపు ఏకైక లక్ష్యము బుద్ధుడు ప్రవచించిన ప్రధమార్య సత్యము 'సర్వం దుఃఖమ్ దుఃఖమ్' అను దానిని వ్యతిరేకించుటయే. పురుషార్థసాధన వలన మానవుడు ఇహమున సుఖముగ జీవించుటయే గాదు; పరమునను సుఖించును. అందువలన మోక్షముకూడ సుఖమునిచ్చునదియే. కావున మానవుని జీవితమును సుఖాంతముగ రూపొందించి చిత్రించుట కావ్య, నాటక రచయితల ధర్మమైనది. అందువలన శృంగార, వీర, శాంత రసములే అంగి రసములుగ కావ్య నాటకములందు కన్పడును. కరుణరసపు స్థాయిభావము శోకము. క్లేశము, ఇష్టజననాశనము, విభవనాశము, హత్య, నిర్బంధము, దేశబహిష్కారము, బలవన్మరణము, ఆపదలు ప్రాపించుట వంటి విభావాల వలన కరుణరసము పుట్టును; ఇవి

సహృదయులకు శోకము కలిగించును. ఇట్టి వానితో కావ్య, నాటకములను ముగించుట చతుర్విధ పురుషార్థ భావనకు ఉచితము కాదని భారతీయ లాక్షణికుల భావన. అందువలన దుఃఖాంతనాటకములు సంస్కృత సాహిత్యమునను, భారతీయ దేశభాషా సాహిత్యములందును కన్పడవు. ''భాసుడు'' రచించిన 'ఊరుభంగము' వంటివి ఒకటి రెండు మాత్రమే ఇందులకు అపవాదములుగ కన్పట్టుచున్నవి.

'దుఃఖాంతము' అనగా ఆ కావ్యమునగాని, నాటకమునగాని అంతమున కథానాయకుడో, నాయికయో, లేక ఆ యిరువురో మరణించు సంఘటన రూపింపబడునది - అని ఇచట గ్రహింపవలసియున్నది. అంతియేగాని, దుఃఖ సంజనకములై, సహృదయుల హృదయముల శోక భరితములు చేయు సంఘటనలు సుఖాంతములందుండవని అర్థము కాదు. యర్థమున, చక్కగ పరిశీలించి చూడగ, సంస్కృత సాహిత్యమున ప్రముఖ రచనలందు పెక్కింట దుఃఖజనకములగు సంఘటనలే అధికభాగములను ఆక్రమించినవి. అచ్చట కరుణరసము అంగరసమే (అప్రముఖ రసమే) అని లాక్షణికులు అనవచ్చును; కాని ఆ అంగరసము ప్రముఖమగు రసాన్ని, అనగా శృంగార, వీర, శాంత రసాదులలో దేనినైనను మ్రింగివేయునంతగా కన్పట్టును. ఉదాహరణకు సంస్కృత మహాభారతమును గ్రహింపవచ్చును. అందలి కథలో కరుణరసమే విరివిగ కన్పడును. యుద్ధము, తత్ఫలితమగు వినాశము, ద్రౌపది పరాభవము, విజేతలుగ గట్టెక్కిన పాండవులకు కలిగిన పుత్రనాశము, నూరుగురు పుత్రులను కోల్పోయిన గాంధారీ ధృతరాష్ట్రుల దిక్కులేని చావు, అంతఃకలహాల వలన యాదవుల సర్వనాశనము, పాండవుల అంతము - ఇవి యన్నియు కరుణరస పోషకములు గాక మరి యెట్టివి కాగలవు? పాండవులు స్వర్గమునకు చనిరని చెప్పి భారతమున అంగిరసమును శాంతముగ భావించుట లాక్షణికులకు మాత్రమే సరికుదురును.

రామాయణములో క్రౌంచమిథునమున మగ పక్షిని బోయవాడు చంపినవుడు అధిక్షేపించుచు వాల్మీకి - ''మా నిషాద ప్రతిష్ఠాం'' అని మొదలిడి రచించిన శ్లోకమున వ్యక్తమగు కరుణరసమునకు స్థాయి శోకమే. శోకమే అచట శ్లోకముగ పరిణమించెనని పెద్దలు చెప్పెదరు. ఆ శ్లోకమునకు గల రెండర్థములలో ఒకటి బోయవాని దుష్కార్యమును గర్హించునది; రెండవది కామమోహితుని శిక్షించి పురుషోత్తముడు కీర్తిని పొందుట. ఈ రెండర్థములు రామాయణ రచన సాగిన కాలపు ధార్మిక కృషిని వెల్లడించును. సర్వజగత్తును శోకమయముగ భావించు బౌద్ధభావనను ఆవలకు ద్రోచి జీవితమును సుఖమయముగ చేయగలుగు మార్గమును పౌరాణిక హిందూమతము రామాయణము ద్వారా ప్రచారము చేయగలిగిన దనుట అందలి రహస్యము. ఇక ఆ గ్రంథమున పుత్రశోకమున దశరథుని మరణము, సీతాదేవి అనుభవించిన శోకము మొదలగునవి అన్నియు కరుణమునకు ఆలంబనములే.

కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము, హర్షుని నాగానందము మొదలగు వాని యందును కరుణరసము వెల్లివిరిసినది. కాని కథను సుఖాంతముగ చేయుటవలన ఆ కరుణము అప్రముఖ రసముగ మాత్రమే వాని అన్నింట వర్తించినది. కరుణమును ఏకైక ప్రకృతి రసముగ సంభావించిన భవభూతియు ఈ మార్గమునే అనుసరించెను.

ఆంధ్ర సాహిత్యము-ఆధునిక యుగమువరకు - సంస్కృత సాహిత్యమునే అనుకరించి, అనుసరించినది. ఆంధ్ర మహాభారతమునను - సంస్కృతపు మూలమునందు ఉన్న రీతిగనే - శోకము పెక్కుతావుల వెల్లివిరిసినది. ఆ ఘట్టములను అన్నింటిని వివరించుటకు ఇట తావులేదు. ద్రౌపది పెక్కుతావులందు శోకమూర్తిగనే మనకు కన్పడును, మచ్చునకు రెండు ఘట్టములు పేర్కొనదగినవి:

కీచకుని వలన తనకు గలిగిన భంగపాటును భీమునికి తెల్పుచు, ద్రౌపది శోకించుచు అన్న మాటలు.

ఉ. మీ సుభటత్వమున్ బలము మిన్నక పోవగ దుస్ససేను డ
ట్లా సభలోన నన్ బఱిచె నంతియకాక జయద్రథుండు సం
త్రాసభరంబు లే కనుచితం బొనరించిన జెల్లిపోయె నే
డీ సభికుల్ గనుంగొనగ నిట్లయితిన్ వగ నాకు వింతయే

ఆ. అకట ఆడుకూయు నాలకూయును లాతి
వారికైన నరయ వలయు ననిన
నన్ను గీచకుండు దన్నంగ నెట్టులు
చూడనేర్చె ధర్మసూనుడపుడు

ఈ శోకవచనాలతో ఆగక తన పూర్వవైభవమును స్మరించుకొని దురపిల్లి.

ఉ. ఏను మనంబు పెంపుసెడి యిప్పుడు నీచతర ప్రచారముం
బూని నికృష్టనై యుదరపోషణకై తగవేది యెంతయున్
దీనత బొంది యిమ్మెయి సుధేష్ణపనుల్ కనుసన్న జేయుచున్
హీనతనున్కి మీకు వగపేమియు జేయద యేమి చేయుదున్.

శోకము, నిరాశ, పెనగొని హృదయమును కల్లోలపరచి వాక్యరూపమున వెలువడి, మన హృదయములను తాకి వానిని ద్రవింపజేయు ఘట్టమిది.

ఇట్టిదే రాయబార సమయమున మనకు కన్పట్టు ద్రౌపది: రాయబారిగ కౌరవులకడకు పోనున్న కృష్ణునికి ''తన మునుబడ్డ బన్నములు'' తెలుపుటయేగాక,

.......క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి, వెండ్రుకల్
దా తలచేత బూని ......విషాద రోషముల్
గావగలేక బాష్పములు గ్రమ్మగ దిగ్గనలేచి ఆర్తయై.

వ. గోవిందు ముందటం బ్లై యిట్లనియె.

క. ''ఇవి దుస్యాసేనుద్రేళ్లం
దవిలి సగముద్రెవ్విపోయి దక్కినయవి; కౌ
రవుల కడC దీఱుమాటల
యవసరమున దలపవలయు నచ్యుత! వీనిన్.

సీ. ఈ వెంట్రుకలు పట్టి యీడ్చిన యాచేయి
దౌలతగా బోరిలో దుస్ససేను
తను వింతలింతలు దునియలై చెదరి రూ
పటీc యున్నc గని యుదుకాఱుc గాక
అలుపాలc బొనుపదు నట్టి చిచ్చేయిది....

అని వాపోవును. శోకము, ప్రతీకారవాంఛ రూపుగొనిన రీతిలో మన యెదుట ఇటుల ప్రత్యక్షమగు దౌపదీమూర్తి, కఠిన హృదయుని గుండెనైనను కరగించ గలుగునది.

ఈ విధముగ సంస్కృత, ఆంధ్ర సాహిత్యములందు, కరుణరసము - అంగిరసమును మఱుగుపరచగలిగినది. దీనికి కారణము సుస్పష్టము. లోకవృత్తపు మఱుగులను - రవి గానని వానిని సైతము - దర్శించి వెలికి దెచ్చి హృదయమునకు హత్తుకొను రీతిలో ప్రదర్శించ గలుగ, సుకవి, లాక్షణికులు విధించు హద్దులలో మెలగి తన స్వతంత్రతను కుంచింపజేసికొన లేదు. లోకమున కరణ రసమునకు ఒక ప్రముఖ స్థానము కలదు. దానిని అతడు విస్మరించజా లడు. లాంఛన ప్రాయముగ సుఖాంతముగ తన రచనను అతడు సాగించినను, కరుణరసము, ఏ తీరుగనైనను అందు తావు కల్పించుకొని రాణించును.

లాక్షణికులు విధించిన ఇట్టి అవరోధములు ఏవియును లేక ముందునకు సాగినది పాశ్చాత్య సాహిత్యము. ఆ సాహిత్యమునకు మూలస్రోతస్సు ప్రాచీన గ్రీకు సాహిత్యము, గ్రీకు నాటక రచయితలు సుఖాంతము (కామెడ్)లతో పాటుగా దుఃఖాంతము(ట్రాజెడీ)లకును, ఆద రణ కల్పించిరి. ఒక విధముగ చూడ, దుఃఖాంత నాటకములే వారి అభిమానమును ఎక్కువగ ఆర్జించినవని చెప్పవచ్చును. ప్రజానీకమును వానిని ఆదరించినది. నాటకము లేదా కావ్యము దుఃఖాంతమగునెడల ప్రజలను ఆకర్షింపజాలదనుట అర్థరహితమని ఆ గ్రీకు సాహిత్యము రుజువుచేసినది.

మానవ జీవిత రహస్యములను అర్థము చేసికొని, తమ వర్తనను సరిదిద్దుకొని ప్రజానీకము వర్తించటకు దుఃఖాంత రచనలు సహకరించునని గ్రీకు లాక్షణికులు తలచిరి. అట్టి లాక్షణికు లలో ప్రముఖుడగు అరిస్టాటిల్, స్వరచితమగు 'పొయెటిక్స్'లో ఈ విషయమై వ్రాసిన దాని ఆంగ్లానువాదము ఈ దిగువ రీతిగ ఉన్నది.

"A Tragedy is the imitation of an action.... with incidents arousing pity and fear wherewith to accomplish its catharsis of such emotions"

- *(Fife's edition of Poetics, page 16)*

దుఃఖాంత రూపకములలోని సంఘటనలు లోకమునందలి శోక, భయములను అనుకరిం చునవి. వానిని దర్శించి అర్థము చేసికొనువాని భావోద్వేగత 'కెతార్సిస్' కు లోనుకాగలదు - అని అరిస్టాటిల్ అభిప్రాయము. గ్రీకు మూలమునందలి 'కెతార్సిస్' అను పదమునే ఆంగ్లమునను ఇట అనువాదకుడు యథాతథముగ ఉంచెను. ఆ గ్రీకు పదమునకు 'క్షాళనము' అని అర్థము.